

లలాట తిలకం—నృత్యభంగిమ

వర్ణచిత్రం: కుమారి శ్యామా కౌండిన్య—కడప.



"బియ్యపుగింజల్లో వడ్లగింజలు"

చిత్రకారుడు : కేతిసెడి భాస్కరరావు—విజయనగరం.

# సమగ్రమైన, సమర్థమైన పన్నులవిధానం

## ప్రొఫెసర్ కాల్డర్ సూచనలు

భారతదేశంలోని పన్నుల విధానాన్ని పరిశీలించడానికి భారతఆర్థికశాఖచే ఆహ్వానితులైన బ్రిటిషు ఆర్థిక వేత్త ప్రొఫెసర్ నికొలాస్ కాల్డర్ ఇటీవల కొన్ని ప్రతిపాదనలు చేశారు. 4800 కోట్ల రూ.ల వ్యయంతో సంకల్పించబడిన ద్వితీయ పంచవర్ష ప్రణాళిక ఆర్థికావసరాలను దృష్టిలో పెట్టుకుని, ధనసేకరణకు సమగ్ర మార్గాలను ఈ ప్రతిపాదనలు సూచిస్తున్నాయి. పన్నులను ఎగవేయడానికి వీలులేకుండా ఒకేసారిగా వివిధములైన పన్నులను విధించడం వలన ఇప్పటికంటె ఎక్కువ ధనాన్ని సేకరించవచ్చునని ప్రొ॥ కాల్డార్ అభిప్రాయపడుతున్నారు. ప్రస్తుతం ఆదాయం పన్ను నూటికి 92 వంతుల గరిష్ఠ పరిమితి దాకా విధింపబడుతున్నది. ఈ రేటు ఇంత ఎక్కువగా ఉండనవసరంలేదని, నూటికి 45 వంతులను గరిష్ఠ పరిమితిగా నిర్ణయించాలని ఆయన సూచించారు. ఇదిగాక పెట్టుబడిపై పన్ను, వ్యక్తిగత వ్యయంపై పన్ను, బహుమతులు, ధనాలపై పన్ను, పెట్టుబడి లాభాలపై పన్ను విధించాలని ఆయన సూచించారు. ఈ అయిదు పన్నులను విధించడం ద్వారా, ఏ ఉపాయాలు అవలంబించినా ఎక్కడో ఒకచోట పన్నులు చెల్లించవలసి రావడం, ఎగవేసేందుకు వీలుకలుగక పోవడం జరుగుతుందని ప్రొ॥ కాల్డార్ అభిప్రాయపడ్డారు. ప్రస్తుతం మన దేశంలోని పన్నుల విధానం అస్తవ్యస్తంగానూ, అన్యాయంగానూ కూడా ఉన్నదని ఆయన అన్నారు. ఇప్పుడు మన దేశపు మొత్తము ఆదాయంలో నూటికి 7 వంతులు మాత్రమే ప్రభుత్వ ఖజానాకు పన్నుల రూపేణా చేరుతున్నది. ఇది చాలా తక్కువ మొత్తం. ద్వితీయ ప్రణాళికలో లోటు పద్ధతి బడ్జెట్ ద్వారా రూ. 1200 వ్యయం చేయాలని ప్రతిపాదించబడింది కాని దేశ ఆర్థిక వ్యవస్థ రూ 800 కోట్లకంటె ఎక్కువ లోటును భరించలేదని, ప్రణాళిక అదనపు పన్నుల ద్వారా సేకరించవలచిన రూ. 450 కోట్లు చాలదని, ఏడాదికి రు. 250 కోట్ల చొప్పున అయిదేళ్లలో రూ. 1200 కోట్లు అదనపు పన్నులద్వారా సేకరించితేగాని ప్రణాళిక నిర్వహించడం కష్టమనీ కాల్డార్ నివేదిక సూచిస్తున్నది. సమగ్రమైన పన్నుల విధానం, సమర్థమైన వసూళ్ల విధానం అవలంబిస్తే ఆ మొత్తం సేకరించడం కష్టసాధ్యంకాదని ఆయన భావిస్తున్నారు.

ఈ సూచనలను భారతప్రభుత్వం జాగ్రత్తగా పరిశీలించి, మన దేశావసరాలకు అనుకూలమైనవాటినే ఆమోదించవచ్చును. ఇవి ఎంతవరకూ ఆచరణసాధ్యం, ఎంతవరకూ లాభదాయకం అనేది ఆలోచించవలసిన విషయం. భారీఎత్తున దేశాభివృద్ధి ప్రణాళికను తలపెట్టిన భారత ప్రభుత్వం ఎవరు ఏసూచనలు చేసినా పరిశీలించడం, దూరదృష్టితో కొన్ని విధానాలను ప్రయోగం చేసి ఫలితాలను విలువకట్టడం అవసరం.

ఈ సందర్భంలోనే ప్రొ॥ కాల్డార్ మరొక ముఖ్యమైన సూచన చేశారు. వ్యక్తిగత ఆదాయానికి పరిమితిని విధించాలని దేశంలో ప్రస్తుతం జరుగుతున్న ప్రయత్నాలను ఈయన ఖండిస్తూ, ఆదాయానికి గరిష్ఠ పరిమితి నిర్ణయించడం అవివేకమనీ, దీనివలన ఆర్థిక అసమానత తొలగదనీ ఆయన పేర్కొన్నారు. సమగ్రమైన, సమర్థమైన పన్నుల విధానం వలన ఆర్థిక అసమానతను చాలవరకు తగ్గించవచ్చునని ఆయన అభిప్రాయపడ్డారు.

ఆదాయానికి గరిష్ఠ పరిమితి నిర్ణయించాలనే ప్రతిపాదనను ప్రధాని శ్రీ నెహ్రూ కూడా లోగడ ఖండించారు. "సామ్యవాదం అంటే ఒక పరిమితి కంటే ఎక్కువ పొందుతున్న ప్రతివాడి తలకాయా కొట్టెయ్యవలసిందని అర్థంకాదనీ, సామ్యపద్ధతిలో పంచడానికి తగినంత సంపద సృష్టించబడినప్పుడే సామ్యవాదం ఆచరణీయమవుతుందనీ, సంపదలేనప్పుడు దాన్ని జాతీయం చేసే ప్రశ్నే లేదనీ శ్రీ నెహ్రూ అన్నారు.

# జీవితభీమా జాతీయంచేసే సమస్య

మన దేశంలోని జీవితభీమా వ్యాపారాన్ని జాతీయంచేస్తూ, ఈ వ్యాపారం నిర్వహించడానికి ఒక కార్పొరేషన్ను ఏర్పాటుచేసే బిల్లును ఇటీవల లోక్ సభ ఆమోదించింది. జాతీయం చేసినందుకు పరిహారంగా దాదాపు రూ. 45 కోట్లు చెల్లించవలసి ఉంటుందని ఆర్థికమంత్రి శ్రీ దేశ్ ముఖ్ అంచనా వేశారు. జీవితభీమాను జాతీయంచేయడానికి వచ్చిన బలమైన వ్యతిరేకతను జయప్రదంగా ఎదుర్కొన్న ఆర్థికమంత్రి అభినందనీయులు.

ద్వితీయ పంచవర్షప్రణాళికను నిర్వహించడానికి దేశంలోని మిగులుధనం ఎంతగా లభ్యమైతే అంతమంచిది. ధనసేకరణకు పన్నుల విధింపు ఒకటే మార్గంకాదు. అందులో ధనాఢ్యులు అల్పసంఖ్యాకులుగా ఉన్న భారతదేశంవంటి దేశంలో పన్నుల మీద ఆధారపడి లాభంలేదు. కొద్దికొద్దిగా మిగల్చగలిగినవారినుండి, గ్రామీణ ప్రాంతాలనుండి ఎక్కువగా పెట్టుబడిధనం సేకరించవలసి ఉంది. ఈ పరిస్థితిలో ప్రజలు వీలైనంత ఎక్కువగా మిగల్చడానికి మార్గాలను అధికం చేయడం అత్యంతావశ్యకమవుతున్నది.

ప్రైవేటు యాజమాన్యంక్రింద జీవితభీమా వ్యాపారం అభివృద్ధి చెందవలసినంతగా అభివృద్ధి కాలేదని భారతప్రభుత్వం అభిప్రాయపడింది. 38 కోట్ల జనాభాగల భారతదేశంలో 50 లక్షలు మాత్రమే పాలసీలున్నాయి. పాలసీదారుల సంఖ్య ఇంకా తక్కువ - నూటికి ఒకవంతుకంటె తక్కువగా ఉన్నది. పాలసీదారు ఏటా చెల్లించే ప్రీమియంధనం జాతీయాదాయంలో నూటికి అరవంతుకంటే ఎక్కువలేదు. మొత్తం పాలసీల విలువ జాతీయాదాయంలో నూటికి 8 వంతులకంటె లేదని గుర్తుంచుకుంటే జీవితభీమా వ్యాపారం ఎంత హీనస్థితిలో ఉన్నదో ఊహించవచ్చును. ఈ పరిస్థితి బాగుపడితే తప్ప దేశానికవసరమైన పెట్టుబడి ధనం తగినంతగా పెరగదు

ఇక జీవిత భీమా కంపెనీల యాజమాన్యం కూడా అసమర్థంగా ఉంటున్నది యాజమాన్య వ్యవహారాలకు 1954 సం॥లో అయిన వ్యయం మొత్తం ఆదాయంలో నూటికి 23 6 వంతుల చొప్పున ఉన్నది ఈవ్యయంరేటును జీవిత భీమా వ్యాపారాన్నంతనీ ఒకే యాజమాన్యం క్రిందికి తేవడం వలన బాగా తగ్గించ వీలవుతుంది ప్రీమియంరేట్లను తగ్గించి, జీవితభీమాను అధికం చేయడాని

# ★ జీవితభీమా జాతీయంచేసే సమస్య ★

శీలవుతుంది. భీమా వ్యాపారం ఇతర వ్యాపారాల వంటిది కాదు. పోటీ విధానం జీవిత భీమా వ్యాపారానికి అనవసరం. గడచిన పదేళ్లలో 25 కంపెనీలు దివాళా తీశాయి. మరో 25 కంపెనీలు తమ వ్యాపారాన్ని ఇతర కంపెనీలకు అప్పగించివేయవలసిన అవసలో పడ్డాయి. ఇలాటివే ఇంకా అనేక కారణాలవల్ల భారతదేశంలో జీవితభీమా వ్యాపారం బాగా అభివృద్ధి కాలేదు. ప్రైవేటు యాజమాన్యాన్ని, పోటీదృక్పథాన్ని తొలగించి, వ్యాపారాన్ని జాతీయం చేయడంవలన పై లోటుపాట్లను సర్దుబాటు చేయవచ్చునని ప్రభుత్వం ఆశించింది. అదీగాక జీవిత భీమా కంపెనీలు ఎక్కువగా పట్టణాలలోనూ, పెద్ద ఆదాయాలు గల వర్గాలలోనూ మాత్రమే వ్యాపారం చేస్తున్నాయి. గ్రామీణ ప్రాంతాలలోకి, తక్కువ ఆదాయాలుగల వర్గాలలోకి వ్యాపారాన్ని విస్తరింపజేయడానికి ప్రభుత్వమే పూనుకోవాలి. ప్రభుత్వ యాజమాన్యంక్రింద ఈ అభివృద్ధి, విస్తరణ సాధించడం సులభసాధ్యంకూడా అవుతుంది.

జీవిత భీమాను జాతీయం చేయడంవలన పెట్టుబడి ధనం ప్రైవేటు రంగానికి ఇవ్వకుండా ప్రభుత్వ రంగానికే లభించేట్లు చేయాలని తమ అభిమతం కాదనీ, కనీసం ఇంతవరకూ లభ్యమవుతున్నంత పెట్టుబడి ధనమూ, ప్రైవేటు రంగానికే లభించేట్లు చేస్తామనీ, వ్యాపారసులు ఈ విషయమై భయపడనక్కరలేదనీ ఆర్థికమంత్రి హామీ ఇచ్చారు. "జీవిత భీమాను జాతీయం చేయడం ప్రజల మిగులు ధనాన్ని మరింత సమర్థంగా సేకరించడానికి అవలంబించబడిన చర్య" అని ఆర్థిక మంత్రి అన్నారు. అందుచేత ఈచర్యకు ఆధారం కేవలం సామ్యవాద సిద్ధాంతాన్ననుసరించాలనే అభిలాష మాత్రమేకాదు. అది దేశావసరాలకు కూడా అనుగుణమైన చర్యఅని అంగీకరించవలసి ఉంటుంది.

# సింగపూర్ స్వాతంత్ర్యచర్చలవైఫల్యం

"విషాన్నం తినడం కంటె ఆకలితో ఉండిపోవడమే మేలు. సింగపూర్ ప్రభుత్వం బ్రిటిష్ ప్రభుత్వానికి అణిగి ఉండేట్లు చేసేపద్ధతికి ఒప్పుకోవడం కంటె రిక్తహస్తాలతో తిరిగిరావడమే మంచిదనిపించింది."

సింగపూర్ ముఖ్యమంత్రి శ్రీ డేవిడ్ మార్షల్ రాజీనామా ఇచ్చే సందర్భంలో శాసనసభలో అన్నమాటలివి. సింగపూర్ స్వాతంత్ర్యం విషయమై బ్రిటిష్ ప్రభుత్వముతో సంప్రదించడానికి లండను వెళ్లి, సంప్రదింపులు విఫలమైనందువల్ల శ్రీమార్షల్ రాజీనామా ఇచ్చారు. ఆయన స్థానంలో లేబర్ ఫ్రంట్ పక్షానికే చెందిన లిమ్ యూ హాక్ ముఖ్యమంత్రి పదవి స్వీకరించారు.

బ్రిటిష్ ప్రభుత్వ వలస శాఖ వైఖరి వల్లనే తమ సంప్రదింపులు భగ్నమైనాయని శ్రీ మార్షల్ ఆరోపించారు. సింగపూర్ ప్రభుత్వాధినేతగా బ్రిటిష్ హైకమీషనరును కాక, మలయన్ గవర్నరుజనరల్ నునియమించాలనీ, సింగపూర్ పై అజ్మాయిషీ అధికారాన్ని బ్రిటిషు వలసశాఖకు కాక కామన్వెల్తు సంబంధాల శాఖకు అప్పగించాలనీ తాను అడిగిన కనీసపు కోర్కెలకు వలస శాఖ అంగీకరించలేదనీ, ఈ కారణాలవల్ల తాను తప్పుకోవడంకంటె మార్గాంతరం లేకపోయిందని ఆయన స్పష్టపరిచారు.

భారతదేశానికి, బర్మా, సింహళ దేశాలకు స్వాతంత్ర్యం ఇచ్చివేసి కాలానుగుణమైన వివేకం ప్రదర్శించిన బ్రిటిషు ప్రభుత్వం సింగపూర్, సైప్రస్, ఏడెన్ వంటి చిన్న చిన్న ప్రాంతాలను అస్వతంత్రంగానే ఉంచాలని నిశ్చయించడం ఏ విధంగాను సమర్థించడానికి వీలు లేనిది. తమకు స్వాతంత్ర్యం ఇచ్చినప్పటికీ సింగపూర్ కామన్వెల్తులోనే ఉంటుందని, బ్రిటన్‌తో సన్నిహితంగా, స్నేహంగా వ్యవహరించడం మీదనే తమ అభివృద్ధి ఆధారపడిఉంటుందని తమకు తెలుసునని శ్రీ మార్షల్ స్పష్టం చేశారు. భారతదేశం మొదలైన వానికి స్వాతంత్ర్యం ఇవ్వడంవలన ఈ దేశాలు బ్రిటన్‌తో స్నేహ సంబంధాలు పెంచుకొంటున్నాయే తప్ప విరోధవైఖరి అవలంబించడం లేదు. ఏవో సాకులు చెప్పి సింగపూర్ వంటి ప్రాంతాలను అస్వతంత్రంగా ఉంచి, ప్రజాభీష్టానికి విరుద్ధంగా వ్యవహరించడంవలన ఆ ప్రాంతాలలో బ్రిటిష్ వ్యతిరేకత పెరిగిపోతుందే తప్ప తగ్గదు. యుద్ధప్రమాదం ఏర్పడిన సందర్భాలలో సింగపూర్ మొదలైన కీలక ప్రాంతాలు తమ రక్షణ కార్యక్రమానికి అత్యంతావశ్యకమని బ్రిటిష్ ప్రభుత్వం భావిస్తోంది. అయితే ఆయా ప్రాంతాలలోని స్థానికప్రజానీకానికి తమపై సానుభూతిఉండి, సహకరిస్తేనేగాని ఈ స్థావరాలేవిధంగానూ బ్రిటిష్ వారికి తోడ్పడవు. ఆ సానుభూతిని సహకారాన్ని బ్రిటన్ తన మొండి పట్టుదలవల్ల క్రమంగా కోల్పోతున్నది. ముందుముందు సైప్రస్‌లో జరిగిన ధోరణిలోనే సింగపూర్‌లోకూడా ప్రజాందోళన తీవ్రతరం కావచ్చు. ఇటువంటి దుష్పరిణామాల వలన వలస ప్రాంతాలకు సంబంధించినంతవరకూ, ముఖ్యంగా ఆసియాలో బ్రిటన్ ప్రతిష్ఠ బాగా దెబ్బతినిపోగలదు. అయినప్పటికీ మాంచెస్టర్ గార్డియన్ లాంటి పత్రిక "హిందూ మహాసముద్రంలోని స్థావరాలను బ్రిటన్ ఖాళీచేసి వెళ్లిపోవడం వలన బ్రిటన్‌కంటె ఆసియా దేశాలకే హానికరం," అని వ్రాయడం హాస్యాస్పదంగా వున్నది. యుద్ధప్రమాదం ఏర్పడినప్పుడు ఈ ప్రాంతాలలోని ప్రజలు బ్రిటన్‌ను సైనిక సహాయం వేడక తప్పదనీ, అప్పుడు బ్రిటన్ శీఘ్రంగా సహాయం పంపించడం సాధ్యపడదనీ, ఆ విధంగా ఆ ప్రాంతాలు కొత్తగా ఆర్జించుకున్న స్వాతంత్ర్యం నేలపాలుకాక తప్పదనీ ఆ పత్రికభావం. కేవలం ఆ ప్రాంతాల "స్వాతంత్ర్యాన్ని" రక్షించడానికే వాటిని అస్వతంత్రంగా ఉంచుతున్నామనే బ్రిటిషువాదం స్వయం విరుద్ధంగా ఉన్నది.

సూయజ్ కాలువ ప్రాంతాన్ని ఖాళీ చేయడానికి నిశ్చయించిన సందర్భంలో రెండేళ్లక్రిందట "మధ్యప్రాచ్యంలోనూ, ఇతర ప్రాంతాలలోనూ స్థానిక ప్రజల సమ్మతి, సహకారాలమీదనే మన రక్షణ ప్రయత్నాలు ఆధారపడి ఉండా" లని శ్రీ ఈడెన్ ప్రకటించారు. సింగపూర్‌కు కనీసం మలయన్ ఫెడరేషన్‌కు ఇచ్చిన పాటి స్వాతంత్ర్యమైనా ఇవ్వడానికి నిరాకరించడం, అంతరంగి

బొల్లి
మహాపాడ. సమస్త చర్మవ్యాధులకు అమోఘ చికిత్స
క్యాటలాగు పంపు ఉచితం
జి.వి.రెడ్డి & కో రిజిష్టర్డ్
భాస్కరాశ్రమము గోపాలపురం తూర్పుగోదావరిజిల్లా

వ్యవహారాలపై కూడా తమకే అధికారం ఉండాలనడం పై ప్రకటనకు వ్యతిరేకంగా ఉన్నది.

"తమ అభీష్టానుసారం ప్రభుత్వాలనేర్ప రచుకునే ప్రాథమిక హక్కు ప్రజలకు ఉండాలి" అని మొన్న మొన్న వాషింగ్టన్‌లో శ్రీ ఈడెన్ చేసిన ప్రకటన సింగపూరుకు యెందుకు వర్తించరాదో అర్థంకాదు.

అని పండిట్ నెహ్రూ పేర్కొన్నారు. ఈ సత్యాన్ని ఫ్రెంచివారు నిర్లక్ష్యంచేసి, అల్జీరియన్ ప్రజాసమరం కేవలం దౌర్జన్య కారుల తిరుగుబాటుగా చిత్రించడం వలన జాతీయోద్యమం క్రమంగా మరింత హింసాపూరితమైన దౌర్జన్యోద్యమంగా రూపొందే ప్రమాదం ఉన్నది.

ఆ ప్రమాదం సంభవించకుండా చేయడానికి అల్జీరియాలో నివసించే అన్ని జాతులవారి సమాన హక్కులను గుర్తించడం ప్రాతి పదికగా సంపూర్ణ స్వాతంత్ర్యం ఇచ్చి వేయవలసిందిగా భారత ప్రధాని ఫ్రెంచి ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు. ఈ విజ్ఞప్తిని ఫ్రెంచివారు పాటించడం వివేక లక్షణం.

# "మీ కుమారుడు తిరిగిరాడు"

## అల్జీరియా జాతీయోద్యమం

"అమ్మా! మీకొక విషాదవార్త పంపిస్తున్నాము మీకుమారుడు తిరిగిరాడు. అతడు యుద్ధంలో మరణించాడు. కర్మవాదులు ఇది కర్మ అంటారు. వాస్తవిక వాదులు ఇది ఉన్మాదం, మన నాయకుల మూర్ఖత అంటారు. అల్జీరియాలో యుద్ధం పనికిమాలిన యుద్ధం. ఈ యుద్ధాన్ని మనకు అంటగట్టిన వారే నిజంగా హంతకులు.. మీ కన్నీళ్లు తుడుచుకోండి. మీ బాధ్యతలు మీరు నెరవేర్చండి మీ పరిపాలకుల వద్దకు, మీలాటి ఇతర స్త్రీలతో వెళ్లి చెప్పండి, జరిగింది చాలనీ, యుద్ధం ఆపుచెయ్య వలసిందనీ..."

అల్జీరియా జాతీయ విమోచన సైన్యం ఫ్రాన్సులోని ఒక వనితకు వ్రాసిన ఉత్తరం ఇది.

అల్జీరియాలో ఉగ్రరూపం దాల్చిన సంఘర్షణ ప్రపంచ శాంతికాముకు లందరినీ కలవర పరుస్తున్నది. ఈ నిష్కారణ వృథా సంఘర్షణ పట్ల భారతదేశం వంటి దేశాల లోనే కాక ఫ్రాన్సులోనే అధిక సంఖ్యాకులు విముఖత చూపిస్తున్నారు. ఈ విముఖతను ఖాతరుచెయ్యకుండా ఫ్రెంచి జాతీయ సభ ఫ్రెంచి ప్రభుత్వం ఉత్తరాఫ్రికాలో అనుసరిస్తున్న విధానాన్ని ఆమోదిస్తూ తీర్మానం చేసింది.

ఫ్రెంచి ప్రభుత్వం ఇండోచైనా, ట్యునీషియా, మొరాకోల విషయంలో ప్రదర్శించిన రాజనీతిజ్ఞత అల్జీరియాలో అనుసరించలేక పోతోంది.

ఇండోచైనాలో ఫ్రెంచివారి వైఖరి ప్రపంచ శాంతికి భంగకరం కానున్న సమయంలో ఇతర అగ్రరాజ్యాలు కలగజేసుకుని అక్కడ యుద్ధ విరమణకు ఫ్రాన్సునుఒప్పించాయి. అదే మాదిరి పరిస్థితి అల్జీరియాలో కూడా ఏర్పడేట్లు కనిపిస్తున్నది. అల్జీరియా విషయమై గత మాసం పండిట్ నెహ్రూ చేసిన పంచసూత్ర ప్రణాళికను ఫ్రెంచి ప్రభుత్వం ఇంతవరకూ పట్టించుకోలేదు. శ్రీ నెహ్రూ రాజనీతి విశిష్టత అనేక సందర్భాలలో విశదమైనది. అల్జీరియాపై ఆయన చేసిన సూచనకూడా పలువురు రాజకీయవేత్తలనేకాక ఫ్రెంచి జాతీయ సభలో కూడా కొన్నిపక్షాలవారి ఆమోదం పొందినది. మొదటగా యుద్ధవిరమణ జరగాలని, స్వాతంత్ర్యం ప్రాతిపదికగా అల్జీరియా యొక్క వ్యక్తిత్వాన్ని గుర్తించాలనీ ఆయన సూచించారు. అల్జీరియాలో జాతి వివక్షత లేకుండా అందరినీ సమానంగా పరిగణించాలనీ, అల్జీరియాలోనివసిస్తున్న అన్ని జాతులవారికీ అల్జీరియాయే మాతృదేశమని గుర్తించాలనీ ఆయన మరొక రెండు సూత్రాలు ప్రతిపాదించారు. అంతేగాక ఈసూత్రాలు, ఐక్యరాజ్యసమితి ప్రణాళిక ఆధారంగా ఉభయపక్షాలమధ్య ముఖాముఖి సంప్రదింపులు ప్రారంభం కావాలని కూడా ఆయన ప్రతిపాదించారు.

మొరాకో, ట్యునీషియాలలో మాదిరిగా అల్జీరియా సమస్య సులభ పరిష్కరణీయం కానిమాట నిజమే. ఏమంటే అక్కడ దాదాపు పదిలక్షలమంది ఫ్రెంచివారు స్థిరనివాసా లేర్పరచుకుని ఉన్నారు. ఫ్రాన్సుకు నాలుగురెట్లు భూభాగం గల అల్జీరియాలో వ్యవసాయభూములలో అధిక భాగం, అందులో అతిసారవంతమైనభూములు ఫ్రెంచిజాతివారి అధీనంలో ఉన్నాయి. మొరాకో, ట్యునీషియాలలో ఈ పరిసితి లేదు. అందుచేత అల్జీరియాపై హక్కును వదులుకోవడానికి ఫ్రాన్సు ఒక పట్టాన అంగీకరించడం లేదు.

అయితే అల్జీరియాలో 80 లక్షలమంది ముస్లిములున్నారు. ఆసియా, ఆఫ్రికా ఖండాలలోని అనేక దేశాలలో స్వాతంత్ర్యోద్యమాలు బయలుదేరినట్లే అల్జీరియన్లుకూడా స్వాతంత్ర్య సంపాదనకు ఉద్యమించారు. "గతించిన రెండు తరాలలో ఆసియా,ఆఫ్రికాలలో వ్యాపించిన జాతీయోద్యమాలలో అల్జీరియన్ సమరం కూడా ఒక భాగమే"




విజయవాడ స్టాకిస్టులు :
ఎస్కో కార్పొరేషన్ మెయిన్ బజారు.
విజయనగరం స్టాకిస్టులు :
మెసర్సు: మహమ్మద్ యాసిన్ బ్రదర్సు జనరల్ మర్చంట్సు.

స్థాపితము: 1920 సంగ్రం.
సమస్త చర్మవ్యాధులకు, తెలుపు మచ్చలు వగైరా లకు చికిత్సా నిపుణులు.
కేటాగు, సలహా ఉచితము.
రెడ్డి & కో, (రిజష్టర్డు)
గోపాలపురం తూర్పుగోదావరి జిల్లా
(వయా) తణుకు.

వైటోడెంట్
దంతక్రిములను సంహరించే పండ్లపొడి
శ్రీవత్స కెమికల్స్ & డ్రగ్స్ లిమిటెడ్, మదరాసు-30.




నారసింహ లేహ్యము
బంగారుతో చేరినది. మేహము వీక్నెస్, విస్మృతుల వగైరా హరించి బలము రక్తవృద్ధి కల్గించును. 20తు. డబ్బి రు. 3-4-0 పోస్టేజి అ 1-1-0
వి. వి. వి. అండ్ కో, (ఆయుర్వేద సమాజం)
పెరిదేపి (పోస్టు) — నెల్లూరుజిల్లా



ఆగ్నేయాసియా దేశాలలో పర్యటిస్తున్న భారతసాంస్కృతిక బృందం, ఇండోనేషియా రాజధాని జకార్తాలో, ఆదేశపు నాయకులందరూ వచ్చిన ఒక సభలో మణిపూర్ నృత్యం ప్రదర్శించారు.

# సోవియట్ సైన్యాల తగ్గింపు

యుద్ధభీతి వాతావరణాన్ని తొలగించి శాంతిని సుస్థిరం చేసే చర్యలలో మొదటిదిగా సోవియట్ యూనియన్ 12 లక్షల సైన్యాన్ని రద్దు చేయడానికి నిశ్చయించినట్లు ప్రకటించింది. దీనికి తగిన ప్రమాణంలో ఆయుధాలను, సైనిక సామగ్రి, సైనిక వ్యయాన్ని కూడా తగ్గించనున్నట్లు, తూర్పు జర్మనీలో ఉన్న సోవియట్ సైన్యంలో కూడా చాలా భాగాన్ని తొలగించి వేస్తున్నట్లు ప్రకటించింది. అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులు కూడా ఇదే విధంగా పశ్చిమ జర్మనీనుంచి కొంత సైన్యాన్ని తొలగించడంవల్ల జర్మనీ సమస్యపై సమాధానం కుదరడానికి అనుకూల వాతావరణం ఏర్పడుతుందని భావిస్తున్నట్లు సోవియట్ ప్రధాని మార్షల్ బుల్గానిన్ బ్రిటిష్ ప్రధానికి వ్రాసిన లేఖలో పేర్కొన్నారు. అంతే కాక, సోవియట్ సైన్యాల తగ్గింపు ఇతర అగ్ర రాజ్యాల సైన్యాలలోను, ఆయుధాలలోను తగ్గింపుకు దారితీస్తుందని ఆశిస్తున్నట్లు సోవియట్ ప్రధాని తెలిపారు.

పశ్చిమజర్మనీ సైన్యాలను భారీ ఎత్తున పునర్నిర్మించడానికి అమెరికా చేస్తున్న ప్రయత్నాలను భగ్నం చెయ్యడానికి సోవియట్ యూనియన్ ఇప్పుడు ఈ విధమైన సైన్యం తగ్గింపును తలపెట్టి ఉండవచ్చునని పరిశీలకులు భావిస్తున్నారు. అందుచేత సోవియట్ ప్రతిపాదనకు పశ్చిమరాజ్యాలు సుముఖత చూపే అవకాశం అట్టే కనబడదు.

"వచ్చే పదేళ్లలో సైబీరియాను అతి విశాలమైన సోవియట్ స్థావరంగా మనం మార్చివెయ్యాలి" అని సోవియట్ కమ్యూనిస్టు పార్టీ అధినేత క్రుశ్చేవ్ పార్టీ 20వ మహాసభలో ప్రకటించారు. అమెరికా సంయుక్త రాష్ట్రాలకు దాదాపు రెట్టింపు వైశాల్యం కలిగిన సైబీరియాలో బ్రహ్మాండమైన పారిశ్రామిక కేంద్రాలు, ప్రాజెక్టులు నిర్మించబడుతున్నాయి. వీటికోసం లక్షలాది కార్మికులను సైబీరియాకు తరలించవలసిన ఆవశ్యకత ఏర్పడింది. రద్దు చెయబడిన సైన్యాలను సైబీరియన్ పారిశ్రామిక కేంద్రాలకు, నగరాలకు పంపే ఉద్దేశ్యంకూడా సోవియట్ ప్రభుత్వానికి ఉండవచ్చును. అటం, హైడ్రోజన్‌బాంబులు విరివిగా ఉత్పత్తి అయ్యే ఆధునిక కాలంలో మామూలు సైన్యాలకు, సాధారణ ఆయుధాలకు పూర్వపువిలువ తగ్గిపోయింది. అందుచేత భారీసైన్యాలను పూర్వంలాగా నిలిపి ఉంచవలసిన అగత్యం ఇప్పుడు తగ్గిపోతున్నది. ఈ కారణంకూడా సోవియట్ సైన్యం తగ్గింపును ప్రోత్సహించి ఉండవచ్చును. ఏది ఏమైనా, ప్రపంచ రాజకీయాలను గడచిన పదేళ్లుగా ఆవరించిన విష వాతావరణాన్ని నిర్మూలంచేసే ఏ చిన్న చర్యయైనా హర్షించదగినది, ప్రోత్సహించదగినది. ★

ప్రతి పెండ్లి కూతురున్నూ "సుఖమైన వధువు" అనుఉచిత సచిత్ర పుస్తకమునందు, గృహకృత్యములనుగూర్చి ఉపయుక్తమగు సూచనలను తెలిసికొనును. (ఆంగ్లము, హిందీ, తమిళం.లో లభించును.) వ్రాయుడు:

డాల్డా అడ్వయిసరీ సర్వీస్
పోస్టు బాక్స్, 353, బొంబాయి-1.

# గోపాల గవేషణ

పి. గణపతిశాస్త్రి

## ౧

ఆవుదూడ 'అంబా' అని గొంతెత్తి అరిచింది! గోధూళివేళ అయ్యేసరికి శ్రావస్తీ గ్రామంలో నందగోపాలుని ఆలమంద అంతా తిరిగి వచ్చివేసింది కాని ఒకేఒక్క ఆవు తిరిగిరాలేదు

బాగా చీకటిపడింది. అయినా ఇంకా ఆవు తిరిగిరాలేదు. గోశాలలో గోవత్సాలన్నీ తోకలెత్తిపెట్టి ఎంతో సంతోషంగా పాలు కుడుచుకుంటున్నాయి కాని ఆ ఒక్క ఆవుదూడమాత్రం 'అంబా' 'అంబా' అని అదేపనిగా అరవడం మొదలుపెట్టింది ఆ దూడ పుట్టినప్పటినుంచీ నందగోపాలుని ఇలంతా పాడిపంటలతో కలకలలాడింది

అందుచేత ఆ ఆవన్నా, ఆ దూడన్నా నందగోపాలుని కెంతో యిష్టం అది అదేపనిగా అరవడం మొదలుపెట్టేసరికి అతని కా రాత్రి మరి అన్నం సయించలేదు. రాత్రి తెల్లవారూ నందగోపుడు ఆవేమైపోయిందో అని ఆరాటపడుతూనే ఉన్నాడు.

మరునాడు తెల్లవారగట్లే లేచి, ఆవును వెదికి పట్టుకోవడంకోసం శ్రావస్తీ గ్రామానికి సమీపంలోవున్న అడవికి బయలుదేరి వెళ్ళాడు.

నందుడూరిపొలిమేర సమీపించేసరికి బాగా పొడిచింది పొరుగూళ్ళజనం తీర్థప్రజలాగ శ్రావస్తీ గ్రామానికి నడిచి వస్తున్నారు కాని నందుడొక్కడుమాత్రం గ్రామ సమీపంలోవున్న అడవికి బయలుదేరిపోతున్నాడు!

ఆ ప్రజానీకం ముఖాలన్నీ అరుణోదయకాంతులలో నూతనానందావేశాలతో కలకలలాడుతున్నాయి. చిన్న చిన్న పసిపాపలనుకూడా వెంటబెట్టుకొని వారంతా ఎక్కడికి వెడుతున్నారో అని నందుని హృదయంలో ఒక చిన్న జిజ్ఞాస కలిగింది నడవలేక నడవలేక నడుస్తున్న ఒక ముసలితాత దగ్గిరికివెళ్ళి నెమ్మదిగా అడిగాడు:

"ఎక్కడికి తాతా! ఈ ప్రయాణం!"

"శ్రావస్తికి పోతున్నానుబాబూ!"

"ఏమిటి విశేషం!"

"నీకింకా తెలియదా?"

"నాకేమీ తెలియదే!"

"ఈవేళ ఉదయమే గౌతమబుద్ధులు శ్రావస్తికి విచ్చేస్తున్నారట! ఆ మహాపురుషుణ్ణి ఒక్కసారి కళ్ళారా సందర్శించి వత్తామని బయలుదేరాను తిరిగి ఈ జన్మలో మరి ఆయన సందర్శన భాగ్యం కలుగుతుందో! కలగదో!"

అని ఆ వృద్ధుడొక పెద్ద నిట్టూర్పు విడిచిపెట్టాడు నందగోపుడతనిని మళ్ళీ అడిగాడు:

"వారీవేళంతా శ్రావస్తిలో నే ఉంటారా?"

"మధ్యాహ్న భిక్షముగించుకొని వెంటనే తిరిగి శ్రావస్తీనగరానికి వెళ్ళిపోతారట!"

"అయ్యో! అలాగా!" అని నందగోపుడు తిరిగి నిట్టూర్పు విడిచిపెట్టాడు. ముసలితాత అతనివాలకం చూచి ఇలా అడిగాడు:

"మీదేవూరు నాయనా?"

"శ్రావస్తి గ్రామమే!"

"అలాగా! అయితే పొరుగూళ్ళ జనం అంతా తీర్థప్రజలాగ ఇక్కడికే వస్తూంటే నీవున్న గ్రామం విడిచిపెట్టి పోతావేమయ్యా!" అని ఒక చిరునవ్వు విసిరాడా ముసలితాత. నందుడతనికి తన ప్రయాణకారణం తెలియజేశాడు అడవిలో ఆ ఆవే పులివాత పడిందో అని భయపడుతున్నానని కూడా అన్నాడు ఆ మాట విన్న తరువాత ముసలితాత మరి అతని మాట కడ్డు చెప్పలేక తనదారిని వెళ్ళిపోయాడు అతనివంట ఇంకా ఎందరెందరో పరిసరగ్రామస్థులు శ్రావస్తిగ్రామం వైపు నడిచి వెళ్ళారు

అది చూడగానే నందగోపాలుని హృదయంలో ఆరాటం ప్రారంభమైంది గోవు గొడవ విడిచిపెట్టి తాను కూడా వారివెంట పడిపోవాలని అనుకున్నాడు. ఇక ఈ సమయంలో కాకపోతే మరింక తథాగతుని దర్శన భాగ్యమే కలగదేమో నని అతనికొక భయం పట్టుకుంది వెంటనే వెనక్కి తిరిగి రెండుమూడడుగులు వేశాడు.

అంతలో అతని హృదయంలో లేగదూడ 'అంబా' అని అరిచినట్టయింది. ఆవు ఒంటరిగా అడవిలో పులివాత పడిపోతున్నట్టు కనబడింది! 'అంబా' అని గుండె పగిలిపోయేటట్టరిచినట్టు వినబడింది!

అది నందగోపాలుని ఇంటపుట్టిన ఆవు. క్రమంగా అతని పాపలతో బాటే పెరిగి పెద్దదయింది. అతని పాపలందరు ఆ ఆవు పాలు తాగి క్రమంగా పెరిగి పెద్దవారైనారు నందుడు కూడా క్రమక్రమంగా వారితోబాటే ఆ ఆవు పాలుతాగి పెద్దవాడైనాడు.

ఇటీవల ఆ ఆవు కొక కోడెదూడ పుట్టింది అంతవరకు పుట్టినవన్నీ పెయ్యదూడలే కోడెపుట్టిన వేళావిశేషమేమోగాని ఆనాటినించీ నందగోపుని ఇలంతా పసిపాపనవ్వులతో కలకలలాడింది. అతని గుండెలో మళ్ళీ ఆ లేగదూడ 'అంబా' అని అరిచినటు వినబడింది!

నందగోపాలుని కిక కాలుసాగలేదు ముందుగా తొందరతొందరగా అడవికివెళ్ళి, ఆవును వెదికి పట్టుకొని ఆతరవాతనే గౌతమదేవుని సందర్శించవలెనని అనుకొన్నాడు ఒక వేళ తాను తిరిగి వచ్చేసరికి తథాగతుడు గ్రామం విడిచి వెళ్ళిపోతే! ఇక మళ్ళీ ఆయన ధర్మప్రసంగం వినే అదృష్టమే కలుగదేమోనని నందగోపాలుని కెంతో భయం వేసింది తాను చేసుకున్న పూర్వపుణ్యం అంతే అనుకుని ఒక్క వేడి నిట్టూర్పు విడిచిపెట్టాడు తొందర తొందరగా ఆవును వెదికి పట్టుకుని తిరిగి వచ్చి, అసమపక్షం గౌతమదేవుని దర్శన భాగ్యమైనా పొందవలెనని సంకల్పించాడు. బాగా తొందరగా అంగలు వేసుకుంటూ అడవిలోకి వెళ్ళిపోయాడు.

నందగోపుడావుకోసం అడవి అంతా గాలించేసరికి మిట్టమధ్యాహ్నం అయింది ఎండ నెత్తి మాడ్చివేస్తూంది లో లోపల ఆకలి దహించివేస్తూంది నాలుక పిడచ కట్టుకు పోతూంది అయినా నందుడు తన పట్టు విడువలేదు.

అంతలో అడివిలో ఎక్కడో మారుమూలగా ఒక ఆర్తనాదం వినబడింది నందుని కది ఆవు 'అంబా' అని పిలిచిన పిలుపు

## ★ గోపాల గవేషణ ★

లాగే స్ఫురించింది. గబగబా చెట్లులు, పుట్టలు దాటి అపిలుపు వినిపించిన ప్రదేశానికి చేరుకొన్నాడు. అక్కడ హఠాత్తుగా అతనికాక పెన్నిధి కనిపించినట్లయింది!

అది నందుడు చిన్నప్పటినించీ పెంచి పెద్దచేసిన ఆవు! అడివిలో దారి తప్పి ఎటో పడిపోతూ మాటిమాటికీ 'అంభా అంభా' అని అరుస్తూంది ఏ పెద్దపులినో చూచి బెదిరిపోయి కంగారుగా పరుగెత్తి ఉండవచ్చుననీ, అందువల్లనే అడివిలో దారి తప్పి తికమకలు పడుతూ ఉండవచ్చుననీ నందగోపాలుడు ఊహించాడు. వెంటనే దానిని వెంటబెట్టుకుని ఇంటికి బయలు దేరాడు.

ఆవుతో బాట తడు గ్రామం పొలిమేర చేరుకునేసరికి మిట మధ్యాహ్నం దాటిపోయింది. ఎంతో ఆలస్యం అయిందని నందుడిక ఇంటికి చేరుకునే సంకల్పం విరమించుకొన్నాడు. తొందర తొందరగా నడిచి వెళ్లి బుద్ధదేవుని ధర్మబోధ వినవలెనని అనుకొన్నాడు. ఆ అదృష్టం కలిసి రాకపోతే పోనీ అధమం ఒక్కసారి కళ్లారా ఆ మహామహుని సందర్శన భాగ్యమైనా పొందవలెనని ఉవ్విళ్లూరిపోతూ గౌతమదేవుడు శిష్యగణంతో విశ్రమించిన వట వృక్షం వైపు సాగిపోయాడు గోవుకూడా అతని వెంట ఒక చిన్న లేగదూడలా నడిచిపోయింది.

### ౨

అనాడా శవీ గ్రామంలో అరుణోదయ కాంతులు, కాషాయాంబర ధారులైన బౌద్ధ భిక్షుక సమూహాలు ఒకేసారిగా ప్రత్యక్షమైనాయి ఆ భిక్షువులలో గౌతమదేవుని ముఖజ్యోతి అప్పుడప్పుడే ఉదయిస్తున్న భానుబింబంలా మెరిసింది.

అదిచూచి ఆళవీగ్రామస్థులందరు భిక్షువులందరికీ ఎదురేగి అతిథి సత్కారాలతో ఎంతో ఆప్యాయంగా ఆదరించారు. విశాలవట వృక్షచ్ఛాయల్లో వారందరికీ విడుదు ఏర్పాటు చేశారు.

పిమ్మట క్రమక్రమంగా భిక్షాసమయం ఆసన్నమయింది. భిక్షువులందరు తమ తమ భిక్షాపాత్రలు ధరించి ఆళవీగ్రామంలో ప్రవేశించారు. కాని గ్రామస్థులెవ్వరు దానికనుమతించలేదు. తామంతా ప్రత్యేకంగా వారికి విందు చేయబోతున్నామనీ అవిందారగించవలసిందనీ పరిపరివిధాల ప్రార్థించారు. భిక్షువులు మొదట తమభిక్షాధర్మం విసర్జించడాని కంగీకరించలేదుగాని చిట్టచివరికి ఆచార్యదేవుని అనుజ్ఞపై ఆ విందు భోజనానికంగీకరించారు.

పిమ్మట కొంతసేపటికి శ్రమణకులందరు భోజనాలు ముగించుకొని ప్రశాంతవటతరుచ్ఛాయలో సమాసీనులైనారు.

అప్పటి కించుమించుగా రెండు యామాల కాలం గడచిపోయింది. తథాగతుడు వట వృక్షమూలంలో అమర్చిన సుఖాసనంపై విశ్రమించి ఎవరి కోసమో ఎదురు చూస్తున్నట్లుగా ఆళవీగ్రామం పొలిమేరుల వైపవలోకిస్తున్నాడు.

భోజనానంతరం ఆయనచేసే ధర్మబోధ నాలకించవలెననే ఆసక్తితో ఆళవీ గ్రామస్థులందరు అక్కడికి చేరుకొన్నారు. ఇంకా పరిసర గ్రామాలనుంచివచ్చిన వారెందరెందరో ఆ ధర్మబోధ నాలకింపవలెనని ఉత్కంఠతో తహతహలాడిపోతున్నారు. కాని వారందరికీ బుద్ధదేవుని ముఖంలో కేవలం ప్రశాంత మౌనముద్రమాత్రమే ప్రత్యక్షమైంది. అలా ఎంతసేపు వేచిఉన్నా ఒక్కపలుకైనా ఆయన నోటినుండి వెలువడలేదు.

క్రమక్రమంగా మూడో యామం కూడా గడిచిపోయింది. గౌతమదేవుని విశాల నేత్రాలప్పుడప్పుడెవరికోసమో నిరీక్షిస్తున్నట్టుగా స్ఫురిస్తున్నాయి. ఆనిరీక్షణ తాత్పర్యమేమో ఎవరికీఅవగాహనకాలేదు. కొందరు భిక్షువులకదేమీ బోధపడక ఆచార్యునివలెనే తాముకూడా దిక్కులు చూడడం మొదలుపెట్టారు. కాని ఎంత సేపటికీ ఏమీ ఫలితం కలగలేదు.

అంతటాఅనతిదూరంలో గంభీరంగా ఒక 'అంబా' రవం వినిపించింది. అందరుఅటు వైపు చూచారు. గౌతమబుద్ధుని నేత్రాలంతకు పూర్వంనుంచి అవైపే పరికిస్తున్నాయి.

అంతలో ఆగోవును వెంటబెట్టుకుని తొందర తొందరగా అంగలు వేసుకుంటూ వస్తున్న నందగోపాలుడు దనతి దూరంలో ప్రత్యక్షమైనాడు. కాని భిక్షువు లెవరు అతని నంత ఆత్రంగా పరిశీలించలేదు అయితే గౌతముని నేత్రాలు నిశ్చలంగా అతని ఆగమనమే నిరీక్షిస్తున్నట్లున్నాయి వారెవరికీ దాని కారణమేమో బోధపడలేదు

నందు డంతలో గోవును వటవృక్షచ్ఛాయలో నిలిపి నురుగులు గక్కుకుంటూ పరుగెత్తుకువచ్చి బుద్ధదేవుని పాదాలపై సాగిలపడ్డాడు. కొంతసేపటికి లేచి అతివినయంగా దోసిలిఒగ్గి నిలబడ్డాడు చివరి కిలాగైనా దర్శన భాగ్యమైనా లభించిందిగదా! అని ఎంతో సంతోషించాడు. వెంటనే గౌతముడు లేచి నిలబడ్డాడు. ఆనువెంటనే భిక్షువులందరు లేచి నిలబడ్డారు. వారితోబాటు సమాసీనులైన గ్రామీణులంతా లేచి నిలుచున్నారు! బుద్ధదేవుడెంతో ఆత్రంగా పక్కనే నిలబడిన భిక్షువులతో—

"ఇంకా భోజనపదార్థాలేమైనా మిగిలి ఉన్నాయా?" అన్నాడు.

భిక్షువులు "లేకేమి సమృద్ధిగానే ఉన్నాయి" అన్నారు.

"అయితే వెంటనే ఆనందగోపునికి తృప్తిదీరా భోజనం పెట్టించండి! తొందరగా వెళ్లండి!" అన్నాడు.

వెంటనే కొందరు భిక్షువులు నందగోపాలుని వెంటబెట్టుకొని భోజనశాలలోకి వెళ్లిపోయారు. నందగోపునికి అన్నం కంటబడగానే పంచప్రాణాలు లేచివచ్చాయి గత రాత్రినించీ ఆ క్షణంవరకు అతి డాకటితో వనకలాడుతున్నాడు ఆకలితో నవనాడులు కుంగిపోతున్నాయి అయినా ఆ అన్నం చూచేసరికి అతనికి ఇంటిదగ్గర కట్టివేసిన ఆవుదూడ జ్ఞాపకం వచ్చింది. అక్కడికతని ఇల్లు కొంచెం దగ్గరలోనే ఉంది.

ఇక అతనికా అన్నంమీద దృష్టిపోలేదు. అంతలో ఇంటిదగ్గర లేగదూడ 'అంబా' అని గొంతెత్తి అరిచింది. అది వినగానే మర్రి నీడక్రింద నిలబడిన నందపుగోవుని గొంతకన్నా గట్టిగా అరిచింది. నందగోపుడన్నంతినకుండా లేచి నిలుచున్నాడు. కాని అతని కెదురుగా గౌతమబుద్ధుడు నిలబడి చిన్న చిరునవ్వు చిందిస్తూ ఇలా అన్నాడు:

"నాయనా! నీ లేగదూడ పలుపు తెంచు



పని మర్రినీడలో నిలబడిన తల్లిదగ్గరికివచ్చి తనివితీరా పాలు కుడుచుకుంటున్నది. తొందరలేదులే! నెమ్మదిగా భోజనం చెయ్యి!" అన్నాడు. గౌతముడు వట చ్ఛాయవిడిచిపెట్టి భోజనశాలలో ప్రవేశించిన ట్లింతవరకు నందగోపుడు గమనించనేలేదు. ఆయన స్వయంగా అక్కడికి వచ్చి నంద గోపునికి కావలసిన భోజనపదార్థాలన్నీ వడ్డింపజేస్తున్నాడు. ఆ ఆప్యాయత చూచే సరికి నందగోపుని హృదయం ద్రవించి నీరైపోయింది

తథాగతుడు నందగోపుని భోజనం పూర్తి అయ్యేవరకు అతని ప్రక్కనే కూర్చు న్నాడు. ఎంతో ఆప్యాయంగా అతని గోవునుగురించీ, కోడెదూడనుగురించీ ఎన్నెన్నో కుశలప్రశ్నలు వేశాడు." నంద గోపుడు తన కోడెదూడ నుగుటిమీది నల్లని మచ్చలనుగురించీ ఒంటిమీది సుడులను గురించి ఎవరికీ తెలియని రహస్య సాముద్రిక విషయాలెన్నెన్నో వికరువు పెట్టాడు. ప్రత్యేకంగా వంశపారంపర్యతః గ్రహిం చిన కొన్ని గోసాముద్రిక రహస్యా లాచార్యదేవుని కెరుకపరిచాడు. ఆయన అవన్నీ విని తిరిగి కొన్ని కొన్ని చిన్న సందేహాలు తీర్చవలసిందని అభ్యర్థించాడు. నందగోపుడెంతో చనువుతో అవన్నీ ఆచార్యదేవుని కుపదేశించాడు!

అంతేగాని నందగోపుని భోజనం ముగిసే వరకు ఆయన ధర్మబోధలేమీ తలపెట్టనే లేదు. చుట్టూరా నిలిచిన కొందరు భిక్షువు లకు వారి ప్రసంగాలన్నీ కేవలం ఇద్దరు వెర్రిగొల్లల ప్రసంగాలలా వినిపించాయి! వారంతా నోటమాటలేక అలాగే ఆ విడ్డూ రమే తిలకిస్తూ నిలుచుండిపోయారు!

## 3

నందగోపుని భోజనానంతరం బుద్ధదేవు డతనిని వెంటబెట్టుకుని నెమ్మదిగా వటవృక్ష చ్ఛాయకు తిరిగివచ్చాడు. వెంటనే అష్టాంగ ధర్మ ప్రవచనం ప్రారంభమైంది. అమృత వర్ష ప్రాయమైన ఆ ప్రసంగం ఆలకిస్తూ భిక్షువులు, ఆళవి గ్రామస్థులు ఆనంద తరం గాలలో తేలుమునకలైనారు. ధర్మప్రవచనం చేస్తూన్నంతసేపు బుద్ధదేవుడు చిరునవ్వు లతో నందగోపాలుని వైపలవోకగా తిల కిస్తూనే ఉన్నాడు.

అదిచూచి వృద్ధభిక్షువు లనేకులెంతో ఆశ్చర్యపడ్డారు. మరికొందరిలో కొంచెం అసూయకూడా బయలుదేరింది. అయినా కొందరు ధర్మప్రవచనం ముగిసేవరకు ఎలాగో అలాగ నిగ్రహం అవలంబిం చారు. క్రమక్రమంగా కొంతసేపటి కాధర్మ ప్రవచనం ముగిసిపోయింది. పిమ్మట బుద్ధ దేవుడు నందగోపునికి ధర్మదీక్ష అనుగ్ర హించాడు.

వెంటనే వృద్ధశ్రమణకులు, గౌతమ బుద్ధుడు శ్రావస్తీ నగరానికి ప్రయాణమై నారు.

దానితో అంతవరకు నిగ్రహం అవలం బించిన శ్రమణకులలో కొంచెం చలనము, కలకలము బయలుదేరాయి. మరికొందరు కొంచెము బిగ్గరగానే గుసగుసలు మొదలు పెట్టారు!

వారి గుసగుసలకు కొంచెం కారణము లేకపోలేదు. ఇన్నాళ్లనించీ జరుగుతున్న ధర్మ ప్రసంగంలో గౌతమదేవుడు స్వయం గా ఎవరినీ భోజన విషయమై ప్రశ్నించి ఉండలేదు

ఈనాడాయన ఎంతో సేపటినించి వేచి ఉన్న భిక్షువులను, ఆళవి గ్రామస్థులను ఉపేక్షించి స్వయంగా దగ్గర కూర్చుని నందగోపునికి భోజనం పెట్టించాడు. అతని భోజనం ముగిసేదాకా ధర్మప్రవచనం ప్రా రంభించనే లేదు ఇకనందగోపుని విషయం చూస్తే అతడేమీ అంతటి బ్రహ్మజ్ఞుడు కాడు. వట్టి వెర్రిగొల్ల!

అలాంటి సామాన్యుని భోజనవిషయంలో గౌతమదేవుని కంతటి పక్షపాతం కలగ గవలి సిన అవసర మేమి కలిగింది?

వారిగుసగుసలా విధంగా సాగిపోయాయి క్రమంగా అవి బుద్ధదేవునికి వినిపించే టంత బిగ్గరగా విజృంభించాయి.

ప్రశాంతగా శ్రావస్తీనగరం వైపు సాగి పోతున్న సిద్ధార్థుడా మాటలు విని మరి అడుగు వెయ్యకుండా అలాగే నిలబడి గుస గుసలాడుకొంటున్న శ్రమణకుల వైపు చూచాడు. వారిలో ఒక శ్రమణకునితో ఆ గుసగుసలకు కారణమేమని ప్రశ్నించాడు. దానితో భిక్షువులందరు నిలబడిపోయారు. ఒక శ్రమణకు డాచార్యుని కాభిక్షువుల రహస్య సంభాషణలన్నీ తెలియజేశాడు.

అవి విని సమ్యక్స్వం బుద్ధుడొక చిరునవ్వు నవ్వాడు. ఆ చిరునవ్వు చూచి భిక్షువు లందరు విభ్రాంతపడి నిలుచున్నారు.

బుద్ధదేవుడతిప్రశాంత స్వరంతో ఇలా గన్నాడు:

"నందగోపాలుడు నిన్నటినించి ఎంతో క్షుధార్తుడై ఉన్నాడు. కనకనే అతని కావిధంగా భోజనం పెట్టించాను. క్షుధ యాతన లన్నిటిలోను అత్యంత దుస్సహ మైన యాతన! జీవ చైతన్యమే ఆ యాతనా నిదానం! ఇది సమ్యగ్బుద్ధితో అవగాహన చేసుకొన్న వారందరికీ నిర్వాణం కర తలా మలకం!"

అది వినగానే శ్రమణకు లందరు పశ్చాత్తప్తులై వంచిన తల తిరిగి ఎత్తలేదు.

అంతలోనే గౌతముని గంభీరవాణి తిరిగి ప్రతి ధ్వనించింది:

"నాయనా! నందగోపాలకుని వర్తనము, సాధుస్వభావము మీ రెరుగరు. ఎంతగా ఆకటి చిచ్చు వేధించినా అతడు తన గోపాలక ధర్మం విస్మరించలేదు! అతని గోవా త్సల్యం అపారం! మూడు క్రోశాల దూరం నడిచి, ఇంతగా శ్రమపడి నీ ఆళవి గ్రామానికెందుకు వచ్చాడో మీరెవరైనా ఎరుగుదురా?"

ఆ ప్రశ్నతో గుసగుసలాడిన శ్రమణక బృందం శిరస్సులు బాగా కిందికి వంగి పోయాయి.

'ఆనందగోపాలకుని కోసమే!' అన్నాడు బుద్ధదేవుడు.

అదివిని శ్రమణకులందరు నందగోపాలకుని వైపెంతో గౌరవ భావంతో చూశారు. కొందరతనిని సమీపించి సవినయంగా చేతులెత్తి నమస్కరించారు.

గోగోవత్సాలతో ఆళవీగ్రామం పొలి మేరవరకు బుద్ధదేవునివెంట సాగిపోతున్న నందగోపాలుడాచాలాచార్యదేవుని మాటలు విని గౌతమదేవునికి, శ్రమణకులకు ఎంతో భయభక్తులతో సాగిలపడి, లేచినిలబడి అమా యకంగా ఇలాగన్నాడు:

"బాబూ! నేనేమీ ఎరగని వట్టి వెర్రిగొల్ల వాణ్ణి! అయితే ఆమహారాజా వాలాంటి వెర్రిగొల్లలే! మందలో ఒక్క గోవు తప్పి పోయినా మరి వారికిక అన్నపానాలు సయించవు! వారిమనసు అప్పుడే తీసినవెన్న పూసలాంటిది!" ఆ అమాయిక ప్రసంగం విన గానే శ్రమణకులందరి ముఖాలలోనూ చిరునవ్వులు తాండవించాయి

తరవాత నందగోపుడెంతో ఆప్యాయం గా లేగను దగ్గరకు తీసుకొని దానినుదుటిపై ముద్దుల వర్షం కురిపించాడు. దాని మూలం గానే తనకంతటి అదృష్టం కలిగిందని లో లోపల ఎంతైనా మురిసిపోయాడు. అది అతని చేతిపై లోకసారి కుడుచుకొని గొంతెత్తి అంబా అని అరిచింది. ★


## కలవరపడు స్త్రీలకు



"కుమారి" (మాత్రలు)
మరవకండి మీ ఆరోగ్యం
రక్షించును చింతఅవసరం
సెం (సాదా) రు. 3/-
(స్పెషల్) 5/-
(ఎక్స్ట్రా స్పెషల్) 8/-
పోస్టేజి ప్యాకింగ్ ప్రత్యేకం

Mrs P. Devee, F.D.S. (AP) Calcutta-40.
స్టాకిస్టు: Indo Medical supplies
No. 1 Pauliappan st, Seven wells
Madras - 1.

# ఎఱ్ఱదారం

ఎన్నో రంగుల దారాలుండగా ప్రత్యేకంగా ఈ యెఱ్ఱదారమంటే యెందుకో యింత యిష్టం దేనికని చాలా కాల మనుకుంటుండేవాడో అనుభవమున్నవాడు. కాకపోయినా - ఎఱుపూ, నలుపూ, తెలుపూ, పసుపూ - యెన్నిరంగులున్నాయో అన్ని రంగులదారాలూ వుంటాయికదా. యేదో రంగు లేకుండా దారమే లేదుగదా అలాంటప్పుడు యేరినటు వెటకారంగా యీ వొక్క యెఱ్ఱదారాన్నే యెందుకిలా అసహ్యించుకోవాలోనని తీరికున్నప్పుడల్లా సానుభూతితో తలపోస్తుండేవాడు రామకృష్ణయ్య. చనిపోయిన నాడందరూ 'పునాది' కనుకున్నది 'సమాధి' కి వచ్చిందనుకున్నప్పుడు గాని అతనికి బోధపడలేదు

* * *

రామకృష్ణయ్యగారంటే మంచివాడనీ, యోగ్యత, అనుభవం కలవాడనీ వచ్చిన ప్రతి ఆఫీసరూ మెచ్చుకొనేవాడు. ఆ ఆఫీసాఫీసరి కేనాడువచ్చిందో ఆనాటినుంచీ అదే ఆఫీసులో గుమాస్తా గిరిలో జీవితాన్ని ప్రారంభించారు రామకృష్ణయ్యగారు. తెలివితేటలకుతోడు వినయ విధేయతలు రామకృష్ణయ్యగారికి గౌరవం తెచ్చాయి. ఏ వొక్కడిదగ్గరా యేనాడూ రామకృష్ణయ్య యెఱ్ఱని యేగానీ, కనీసం బహుమతుల రూపంలోనో అరటిపండ్ల గెలగానీ, వో మామిడిపండ్ల బుట్టగానీ, చివరకొక బూడిద గుమ్మడికాయనైనా, ముట్టినట్లు ఎవరూ కనీవినీ యెరగరు. అంతటి శీలవంతుడూ, గుణవంతుడూ, అయిన రామ రామకృష్ణయ్య చాలాకాలానికి గాని వో చిన్న ప్రమోషనుకు నోచుకోలేకంటే దానికి కారణం చాలాకాలం దాకా యెవ్వరికీ తెలియలేదు. రామకృష్ణయ్య చాలా ఖచ్చితమైన వ్యక్తి. తాను చూస్తుండగా, తనకు తెలిసియే వొక్క వ్యక్తికైనా అన్యాయం జరుగుతుంటే సహించడు. ఏ ఆఫీసరుతోనైనా సరే నిర్మొహమాటంగా వాదించి అన్యాయాన్నరికడతాడని ఆ ఆఫీసుకింద వున్న అన్ని ఆఫీసుల్లోనూ కూడా ప్రతీతి. అంతమంచి వ్యక్తికి సూపర్నెంటుపనిచాలా కాలం క్రిందటనే రావలసిందిగాని రావటం దుకు మాత్రం విచారించే వారంతా.

తరువాత కొంతకాలానికి నిజాయితీని గౌరవించగల మరో రామకృష్ణయ్యలాంటి వ్యక్తి అక్కడికి ఆఫీసరుగా రావటంవల్ల రామకృష్ణయ్యకు సూపరింటెండెంటుగా ప్రమోషను వచ్చింది. "ఇంతచేస్తే పాపం రామకృష్ణయ్యగారి కింతకాలం ప్రమోషను రాకపోవటానికి కారణం ఆయనపై నున్న 'కాన్ఫిడెన్షియల్ రిపోర్టులని' "ఆ ప్రమోషనిచ్చిన ఆఫీసరు తన భార్యతో అనబట్టి నలుగురికీ తెలిసింది! అప్పుడు ప్రమోషనివ్వటానికి పై ఆఫీసు చాలా అభ్యంతరాలు పెడితే యీ ఆఫీసరు చాలా గట్టిగా సిఫారసు చేసి వ్రాయవలసి వచ్చిందిట! సూపరింటెండెంటు రామకృష్ణయ్యగారా గోదాలో రెండు సంవత్సరాలు గడిపారో లేదో పాపం జబ్బుచేసి సెలవు పెట్టవలసి వచ్చింది. ఆ సెలవు సెలవు అలాగే చాలా కాలం పొడిగించవలసి వచ్చింది. చివరకు అదే కారణంగా ఉద్యోగ విరమణకూడా చేయమన్నారాయన్ను.

## 'చైతన్య'

రామకృష్ణయ్యగారు నిస్సంతు, భార్య లక్ష్మీదేవమ్మ పరమ యోగ్యురాలు, రామకృష్ణయ్య తన భార్య అమాయకత్వానికి జాలిపడేవారు. మరొకప్పుడా యమాయకత్వానికి భక్తునివలె తన్మయుడైపోయేవారు. లక్ష్మీదేవమ్మగారికి రామకృష్ణయ్యగారు భర్త, భగవంతుడూను! తన అమాయకత్వాన్నాయన, 'అదేమిటే పిచ్చిదానా!' అని పరిహసించినప్పుడామెకు రామకృష్ణయ్య అమాయకత్వమంతా గోచరించినట్లయి నవ్వుకొని, స్త్రీ సహజమైన మాతృత్వ ప్రకృతి పెల్లుబికి "పిచ్చివాడ"నుకొని యభిమానాన్నీ అనురాగాన్నీ నిండించుకొనేది హృదయపు లోతులలో తమకిది లేదని బాధపడ్డనో ఆ దంపతుల జీవితంలో అంతవరకెప్పుడూ లేదు రామకృష్ణయ్య కాలాన్ననుసరించి యింగ్లీషు చదివి వుద్యోగం చేసినా మాతృభాషలో మంచి ప్రవేశంగల వ్యక్తి. తాను పోతన పురాణాలూ, ప్రబంధాలూ, వైష చింతనా, అనుష్ఠానమూ, వేదాంత విచారం సాగించేవారు. ఇక లక్ష్మీదేవమ్మగారికి నోములూ, వ్రతాలూ, పూజలూ, ఇల్లాలి పదవీ యేనాడూ తీరికలేకుండా చేసేవి. ఇరుగు పొరుగిండ్లకైనా పోదనీ, రాదనీ లక్ష్మీదేవమ్మగారిని గర్విష్ఠుల జాబితాలో చేయకుండా ఉండలేక పోయారు యిరుగు పొరుగుల పేరంటాండ్రు!

అంతవరకుండెప్పుడూ రామకృష్ణయ్యగారికి అలాటాలోచన యెప్పుడూ రానేలేదు. తీరా జబ్బుపడ్డాక లక్ష్మీదేవమ్మను గూర్చి ఆలోచించటం మొదలుపెట్టాడాయన. తను చచ్చిపోతానని మొదటి మాటుగా తోచిందాయనకు. చావు తప్పనిదిగదా, జన్మించిన జీవి మరణాన్ని వెంట తెచ్చుకొని వస్తాడంటారు. దానికింతాలోచన యెందుకనుకున్నాడు. చావుకు భయపడని రామకృష్ణయ్య లక్ష్మీదేవిభవిష్యత్తునుగురించి మాత్రం భయపడకుండావుండలేకపోయాడు. చావునుగురించి స్థిమితంగా ఆలోచించి ధైర్యంగా వుండగలిగినవాడు లక్ష్మీదేవమ్మను గురించి, ఆమె భవిష్యత్తునుగురించి ఆందోళన పడసాగాడు. రామకృష్ణయ్య గుండె గతుక్కుమన్నది. తాను నిల్వచేసిందంతా "మంచివాడనే పేరు" తప్పితే మరేమీ లేదని జ్ఞప్తికి రాగానే. కాకపోతే ఆయన వున్న నిలవల్లా కాస్తోకూస్తో "ప్రావిడెంటుఫండు" రూపంలో ప్రభుత్వంవారివ్వవలసిన డబ్బు మాత్రముంది—మరొకరి చేతిలో.

ఎప్పుడూ లేని విచార మావరించుకున్న రామకృష్ణయ్యకి ప్రావిడెంటుఫండు జ్ఞాపకానికిరాగానే కొంచెం హాయికలిగింది ప్రాణానికి. కాని తన తరువాత లక్ష్మీదేవమ్మ యెంతకాలం బ్రతుకుతుందో, అదీ జీవితకాలానికంతటికీ యీ ప్రావిడెంటుఫండు సరిపోతుందా లేదా? తీరా ఈ సొకం అయిపోతే ... ఇక ఆలోచించలేకపోయాడు. ఆమె అన్నార్తురాలై ఏ వంటనో ఏ కాగిగా... హృదయం బ్రద్దలు కాజొచ్చింది ఆలోచించవద్దనుకున్నా ఆలోచన రాకుండా వుండటం లేదు. ఆలోచనలతో తల, తలతో గుండె పోటెత్తి పగిలిపోతున్నై. హృదయస్పందన వేగం హెచ్చిపోయింది. ఏడుపు వచ్చింది ఏడవనూ లేకపోయాడు. ఏ మూలనుంచో ధైర్యం రాజొచ్చింది. లక్ష్మీదేవి కేదో ఓ నిర్దిష్టమైన జీవనమార్గాన్ని అన్వేషించగలిగితే తను నిశ్చింతగా చచ్చిపోగలననుకున్న రామకృష్ణయ్య భగవంతుణ్ణి ప్రార్థించాడు తననీ మాటికి మాత్రం చంపవద్దనీ, తన లక్ష్మికేదో మార్గం చూపిన మరుక్షణం తానే మరణాన్ని నిశ్చింతగా కోరుకుంటాననీ రామకృష్ణయ్య ప్రార్థనా ఫలితమో, లక్ష్మీదేవమ్మ

అదృష్టమో, రామకృష్ణయ్య ఆరోగ్యం బాగా కోలుకున్నాడో నెలకల్లా. ఫించను పుచ్చుకున్న రోజుగా "ప్రావిడెంటు ఫండు" ఇప్పించ వలసిందని ప్రాశాడు కాని ప్రావిడెంటు ఫండుతో యేమి చేయాలో మాత్రం ఇంకా తెగకుండా వుండాలోచనల్లోనే.

* * *

"వ్యక్తి" అన్న తరువాత వానికి గొప్పదమంతైనా కనీసం, భూవసతి ఉంటే ఆ త్రోవ యెలాగైనా వేసు; బ్రతుకు నిబ్బరముగా గడపవచ్చు అందుకనే భూమిలేని పేదలకని "ఆచార్య వినోభాజీ" భూదాన యజ్ఞాన్ని ప్రారంభించి పాదచారులై పల్లె పల్లెనూ దర్శిస్తున్నారు కాబట్టి ప్రావిడెంటు ఫండుతో ఓ 2, 3 యెకరాల మాగాణి భూమిని కొంటే 'లక్ష్మి'కి కొదువ వుండదు—దివ్యమైన ఆలోచనగా కన్పించింది రామకృష్ణయ్యకు. మరు క్షణంలో ముఖ కవళికలు మారాయి—"పిచ్చి లక్ష్మికి కౌలుదార్లు కొల్లిస్తారా, అవస్థ పెట్టి యాతనల పాలు చేస్తారేమో"—అనిపించి ఆ ఆలోచన మానేశాడు రామకృష్ణయ్య అంతటితో.

ప్రభుత్వపు ప్రణాళికా ఋణాలల్లో పత్రాలు కొంటే!...; కాని దానిపై వచ్చే వడ్డీతో లక్ష్మీదేవమ్మ జీవితం గడవదేమోననే సంకోచం యీ ఆలోచనను విరమింప జేసింది యేం చేయాలనే ప్రశ్న మాత్రం మిగిలింది

పడక కుర్చీలో పడుకొని పైకి చూస్తూ ఆలోచిస్తున్న రామకృష్ణయ్య దృష్టిని "వాసా"లాకర్షించాయి మెరపులా తట్టిందాలోచన. ఇలు కడితే! తట్టిందే తడవుగా దీర్ఘంగా ఆలోచించాడు. అందులోగడ సాధక బాధకాలను గురించి ఇంతవరకూ అద్దెకొంపల్లోనే కాపురం చేసిన రామకృష్ణయ్యకు అద్దె కొంపలలోని కష్ట నిష్టూరాలు, వొకటొకటిగా కళ్లకు కట్టినట్లు పింపసాగాయి పదిహేనేళ్లుగా స్వంత ఇంటిలా సంరక్షించుకుంటూ సంసారం చేస్తున్న ఇంటిలోనే తాను జబ్బు పడ్డాడు రోగం తీవ్రమై లక్ష్మీదేవమ్మ దారి తోచక దుఃఖిస్తుంటే డాక్టర్లవాటికి డాక్టరు వాళ్ళ వాళ్లకి తోచినవిధంగా వైద్యంచేస్తూ ఎలాగైనా రామకృష్ణయ్యను బ్రతికించాలని ప్రయత్నిస్తుండగా, జోరున వాన కురుస్తున్న పరిస్థితిల్లో ఇంటి యజమాని డాక్టరుతో "మీ పిచ్చి గాని ప్రయోజనం లేదండీ, నక్షత్రం కూడా మంచిది కాదు, ధనిష్టా పంచకాల్లో పడుతోంది. అయ్యన్న తల తీసికొస్తే బాగుంటుందని" వసిగాట్టు. డాక్టరుకే కోపంవచ్చి నాలుగు చీవాట్లు పెట్టి





సంవత్సరంపొడుగూ
ఆమె కుటుంబానికి
'ఓవల్‌టిన్ యిస్తుంది'

"ఓవల్‌టిన్"లో ఆరోగ్యం, బలము నిలబెట్టే అమూల్యమైన గుణాలుండడంవల్ల తెలివిగల గృహిణి తన కుటుంబానికి సంవత్సరం పొడుగునా "ఓవల్‌టిన్" ఇస్తుంది.

"ఓవల్‌టిన్" ఎల్లప్పుడూ సేవింపదగినదే చలిగా ఉన్నప్పుడు ఒక కప్ వేడి "ఓవల్‌టిన్"కంటె ఉత్తమమైనది ఇంకొకటిలేదు ఎండాకాలంలో అది ఉత్తమమైన శీతలపానీయంగా ఉపకరిస్తుంది. అది మెదడుకు, శరీరానికి పుష్టినిచ్చి హాయిగా నిద్రపట్టించును "ఓవల్‌టిన్" ప్రకృతి సిద్ధమైన ఉత్తమ ఆహారములతో తయారుచేయబడింది. ఇంకను దీనిలో అదనంగా బి. డి విటమినులు చేర్చబడ్డాయి మీ స్టోరునుంచి ఆర్డరు చేయండి. అయితే అసలుదగు "ఓవల్‌టిన్" మాత్రమే వాడండి.

జెరిబ్యాటన్స్ (గ్రాహమ్) ట్రేడింగ్ కంపెనీ
(ఇండియా) ప్రైవేట్ లిమిటెడ్



# ఓవల్‌టిన్

చల్లగాగాని వేడిగాగాని త్రాగవచ్చును



'ఓవల్‌టిన్' అమెచూర్ కార్యక్రమం సిలోన్ రేడియోలో శనివారాలు రా 8 నుండి 8-30 గం॥ల వరకు వినండి. (హిందీ—41.72 మీటర్లు)

ZV. 445



ఇరాస్మిక్ కంపెనీ, లిమిటెడ్, లండన్‌వారి తరపున భారతదేశంలో తయారుచేయబడినది

నోరెత్తకుండా చేశాడట. ఈ సంగతి స్ఫురణకు వచ్చిన రామకృష్ణయ్య గగ్గోలు పడిపోయాడు. మరే దిక్కూ లేని లక్ష్మీదేవమ్మను జీవితాంతం వరకూ అద్దెకొంపలపాల్జేసి తాను పోతే! తల దాచుకోవటానికి చోటు లేని లక్ష్మీదేవమ్మ ఏ వీధిలోనో దిక్కు లేని ... ఇక ఆలోచించలేక పోయాడు. ఇల్లు కట్టి తీరాలనే నిశ్చయించుకున్నాడు. ఎవరో మంచివాళ్లను చూసి ఓ భాగం అద్దెకిస్తే ఆ వచ్చే అద్దె లక్ష్మీదేవమ్మకు జీవనోపాధిగా ఉపయోగిస్తుందని ఇంతకన్నా తాజేయగల "మంచి" మరేదీ ఉండబోదనుకున్నాడు. వెంటనే లక్ష్మీ! అని పిలిచి, 'మన మిల్లు కట్టుకుందాం లక్ష్మీ! మనదంటూ తల దాచుకోవటానికింత చోటూ ఉంటుంది. వచ్చే అద్దె, ఫించనూ మనం సుఖంగా బ్రతకటానికి సరిపోతా'వని లక్ష్మీదేవమ్మ ముఖం లక్ష్మీదేవి ముఖంలా కళకళలాడింది.

* * *

రామకృష్ణయ్య దినచర్యల్లో మరునాటి నుంచీ రెండు నూతనాంశాలు చేరాయి. మొదటిది తపాలాబంట్రోతుకోసం ఎదురు చూడటం; రెండవది అనుకూలమైన నివేశన స్థలాలకోసం గాలించటం. ఈ నివేశన స్థలాలను చూడటానికి వెళ్లేప్పుడు త్రోవలో కన్పించిన ప్రతి యింటినీ పరిశీలించటం, ప్లాను బాగున్నటనిపిస్తే యింటిలోనికి కూడా వెళ్లి సమగ్ర పరిశీలన చేయటం రామకృష్ణయ్య అనుకోకుండా జరుగుతున్న సంఘటనే గాని ప్రయత్నపూర్వకం గాదు. ఆరువారాల తరువాత పోస్టుజవాను రామకృష్ణయ్య గారికి కూడా జాబివ్వవలసిన పని గల్గింది. కవరుమీద ఎకౌంటెంట్ జనరల్ ముద్ర కనబడగానే ప్రాణం లేచివచ్చింది, తీరా లోపలి కాగితాన్ని చూచినాక లేచి వచ్చిన ప్రాణం ఠుస్సుమని జారిపోయింది. ఏవో భోగట్టాల నడుగుతూ రామకృష్ణయ్య పనిజేసిన శాఖ ఉద్యోగుల కెవరికో వ్రాయబడ్డ జాబునకలది! త్రోవ చెప్పకుండా కాగితాలు వాటి వాటి త్రోవలనే వెళ్లాయి. గూడ్సుబండిలా మెల్ల మెల్లగా పోకుసుకు దీన్గా తరువాత మరో ఆరువారాలకు ప్రథమ వళి చెల్లింపు క్రింద రెండు వేల అయిదు వందల రూపాయలు అందాయి. రామకృష్ణయ్య చేతికి తక్షణమే స్థలాన్ని కొనటం; శంకుస్థాపన చేయటం, బావి త్రవ్వించటం జరిగిపోయాయి. మరో నెలకల్లా మిగిలిన పైకం వస్తుందని భావించిన రామకృష్ణయ్య స్వంతయింట్లో వున్నట్టే భావించాడు. బరువెంతో తగ్గినట్లనిపించింది హృదయానికి. అక్కడితో కథ ఆగింది.

(56-వ పేజీ చూడండి)




## 25

కొన్నాళ్లనుంచీ వర్షాలు తెగ కురుస్తున్నాయి. అన్నదారాయ్‌గారి మంటపంలో సాయంకాలమప్పుడు రోజూ సభ తీరుస్తున్నారు. ఆరోజున నీలి బంగళాకి, సంబంధించిన పుక్కిటిగాథ మొదలుకుని- పూరీలో ఏ దేవాలయం శిఖరం మీదనో అయిదువణుగుల మూదంటురాయి పెడితే - దాని ఆకర్షణకు సముద్రంలో ప్రయాణం చేస్తున్న ఓడలన్నీ ఒడ్డుకువచ్చి, అక్కడమునిగి ఉన్న కొండకు కొట్టుకుని నుగ్గు నుగ్గు అయేవిట' - ఇలాంటి అరబ్బీ కథల్లాంటి వింత వింత కథలన్నీ సాగిపోతున్నాయి. శ్రోతల్లో ఒక్కరికీ అక్కడినుంచి లేవ బుద్ధిపుట్టటంలేదు ఇలాంటి వింత వంత కథలు విడిచిపెట్టి ఇంటికి పోవటాని కెవరికీ మనస్కరించటంలేదు. భూగోళంనుంచి ఒక్కసారిగా జ్యోతిషంలోకి వచ్చింది చర్చ "భృగుసంహిత"లాంటి గ్రంథం భూమ్మీదలేదంటే నమ్ము. ఏమీ అక్కర్లా, నీ జన్మరాశి ఒక్కటే చెప్పావంటే చాలు నీ తండ్రి పేరు, నీ కులం పేరు, నీ వృత్తి భూత భవిష్యత్తు అంతా అందులో రాసిఉంటుంది. నువ్వు తేడా ఉన్నదీ లేనిది చూసుకోవచ్చు గ్రహాలకి - రాశిచక్రానికి ఎంత ఇది ఉంటుందో అంతా అందులో రాసే ఉంటుందికదా. అంతే కాదు, నీ పూర్వ జన్మ కూడా-" అని చెపుతున్నాడు దీనూ చౌధురి.

అందరూ అత్యాసక్తితో వింటున్నారు. కాని రామమయ్ చటుక్కున బయటకేసి చూసి, "లేద్దాం పదండి, తర్వాతయితే ఇంక ఇళ్లకు చేరుకోలేము. చూశారా; చూశారా; ప్రళయం ముంచుకురాకుండా ఉంటే చాలు బ్రతికినట్లే, ఎలా కారు కమ్ముకువచ్చిందో చూశారా! లేవండి అందరూ-" అన్నాడు.

వర్షం తెరపిలేదు. ఆగినట్లే ఆగి, మళ్ళీ కుమ్మరిస్తోంది. నాలుగు వైపులా వెలిమబ్బు వేసింది.

హరిహరుడు అయిదు రూపాయలు పంపించాడెలాగో. ఆ తర్వాత ఇహ ఉత్తరంలేదు, డబ్బూ లేదు మళ్లీ. అదీ చాలారోజులయింది. సర్వజయ రోజూ లేవగానే 'ఇవాళయినా తప్పకుండా వస్తుంది డబ్బు' అనుకునేది.

"నువ్వు ఆటలకు బయలుదేరావంటే పట్టుకుందామన్నా దొరకవింక. పోస్టాఫీసుదగ్గర కెళ్ళి కూర్చో. ప్యూన్ బయటకు వచ్చి రావటంతోనే—" అని కొడుకుతో చెప్పటం మొదలెట్టింది.

---

అనువాదం:
**మద్దిపట్ల సూరి**

---

"భలే! నేను కూర్చోవటం లేదనుకుంటున్నావా యేం? నిన్నకూడా ప్యూంటేవాళ్ళ ఉత్తరం, మన పత్రిక ఇచ్చివెళ్లలేదూ! కావాలంటే ఇంకా వచ్చి ప్యూంటేని అడుగు. లేకపోతే నిన్న పత్రిక యెలా వచ్చిందనుకున్నావ్? నేను కూర్చోక పోవటం యేమిటి?" అన్నాడు అపూ.

వర్షం పెద్దదయింది. అపూ తల్లిమాట ప్రకారం రాయ్‌గారి మంటపంలో ప్యూన్ కోసం యెదురుచూస్తూ అలాగే కూర్చున్నాడు. కమ్మరి సాధూ పూరిపాకలోంచి పావురాలు తడుస్తూ తడుస్తూ రివ్వురివ్వన రాయ్‌గారి పడమటింటి చూరులోకి వచ్చి వాలుతూంటే అపూ వాటికేసి అదేపనిగా చూస్తున్నాడు. ఉరుములంటే వాడికి చెడ్డ భయం. మెరుపు మెరిస్తే నెవతల కెంతెంత తోకలో అనుకుంటూ, ఈసారి తప్పక ఉరుముతుంది - అనుకుని చెవుల్లో వేళ్లు పెట్టుకున్నాడు.

ఇంటికి వచ్చి చూసేసరికి అక్క - అమ్మ సాయంత్రంనుంచీ తడుస్తూ మేటెడు చేమకూర తెచ్చి వంటింట్లో పోగేస్తున్నారు.

"ఎక్కడినుంచి తీసుకొచ్చారమ్మా? ఎంత ఉందో!" అన్నాడు అపూ.

దుర్గ నవ్వుతూ - "ఊఁ. ఎంతో! నీకేం నువ్వు ఇంట్లో కూర్చుంటే సరి! అదుగో వాళ్ళ దొరువుదగ్గిర జామతోటలో - చీలమండల లోతు నీళ్లు. వెళ్లి చూద్దాం!" అన్నది.

ప్రొద్దున్నే రేవులోకి వెడితే మంగలి జాధాయ్ పెళ్లాం కన్పించింది. సర్వజయ కొంగుచాటునుంచి ఓ కంచుపళ్లెం బయటికి తీసి, "ఇదిగో చూడు ఇది! రాగి, గిగీ కల్తీ కలిసినది కాదు. అచ్చు మంచికంచు. నువ్వు కావాలన్నావని తీసుకొచ్చాను ఇది ఎప్పటి దనుకున్నావ్. నా పెళ్ళిలో ఇచ్చినవి. ఇలాంటి పళ్లాలిప్పుడసలు రావటమే లేదు" అన్నది.

బేరంచేసిచేసి చివరకు జాధాయ్ పెళ్లాం కొంగునఉన్న ముడి విప్పి అర్ధరూపాయి తీసిఇచ్చి, ఆ పళ్ళానికి కొంగు అడ్డంకప్పి తీసుకువెళ్లింది. ఎవరితోనూ చెప్పవద్దుసుమా అని సర్వజయ మరీమరీ చెప్పింది.

ఒకటి రెండురోజులు వాన వెలవనేలేదు. ఒకటే ఈదురుగాలి, గోతులూ, గుంటలూ నీళ్ళతో పొర్లిపోతున్నాయి. వీధుల్లో, దారుల్లో ఎక్కడచూసినా పీలమండల లోతునీళ్లు. రాత్రింబవళ్లు వెదురుతోపు ఒకటే జుంయ్‌మని మోత. వెదురుచెట్లు చాలావరకు నేలకు ఒరిగాయి. ఆకాశంలో యెక్కడా వెలుగనేది లేదు. మధ్యాహ్న్య మరీ చీకట్లు క్రమ్ముకువస్తున్నాయి. కారుమబ్బులు తూర్పునుంచి పడమరకు తెగ పరుగులెత్తుతున్నాయి. ఆకాశంలో

**జరిగిన కథ:—**

నిశ్చిందిపురం బెంగాల్‌లోని మారుమూల కుగ్రామం. ఆ ఊళ్లో చితికిపోయిన మధ్య తరగతి సంసారి హరిహరరాయ్. అతని భార్య సర్వజయ. కూతురు దుర్గ. హరిహరరాయ్ పెళ్ళయిన తరవాత కొంతకాలం దేశాలు పట్టిపోయి, శాస్త్రాలు, కావ్యాలు చదివి పండితుడై, పదేళ్ళకి తిరిగివచ్చి కాపరంపెట్టాడు. దుర్గ పుట్టిన చాలఏళ్ళకి అతనికి కొడుకు పుట్టాడు. వాడిపేరు అపూ. ఇంట్లో ఎప్పుడుచూసినా 'ఇవాళ ఎలా గడుస్తుందిరా భగవంతుడా' అనే చింతే. కాని పిల్లల కిదేం పట్టింది? దుర్గకి ఒక్కనిమిషం ఇంట్లో కాలు నిలవదు. ఎప్పుడూ ఏ తోటలోనో, ఏ చెట్టుకిందనో ఆడుకుంటూ ఉంటుంది. అపూ ఎప్పుడూ ఊహాలోకంలోనే గడుపుతాడు. వాడికి ప్రతిదీ కొత్తే. ప్రతిదీ వింతే. వాడి జీవితపరిధిలోకివచ్చే ప్రతి సాధారణవిషయమూ అసాధారణమైనదిగా, అద్భుతమైనదిగా వాడికి కనిపిస్తుంది. ఒకరోజున అపూను బళ్లోవేశారు. చదువుచెప్పడంకంటె, బడిలోనే ఒకపక్కనఉన్న చిల్లర కొట్టుపని చూసుకోవడం, కొట్టుకు వచ్చేపోయేవారితో కబుర్లుచెప్పడమే పంతులుగారికి అలవాటైంది. కొట్లోకివచ్చే గ్రామస్థుల కబుర్లు వింటూ అపూ ఏవో ఆలోచనల్లో తేలిపోతూ ఉండేవాడు. పంతులు ఎప్పుడైనా పాఠంచెప్పినా ఆ మాటలు వాడికి అర్థంఅయ్యేవికావు. అర్థంకాని ఆ శబ్ద సముదాయం వెనక వాడికి ఏవో చిత్రవిచిత్రమైన రమణీయలోకాలు, దేశకాలబాధితంకాని ప్రపంచాలు కనిపించేవి. పెద్దవాడైన తరవాత దారికనుక్కొని అక్కడికి వెళ్ళాలని వాడు నిశ్చయించుకున్నాడు. దుర్గకి మంచిసంబంధం ఏదన్నా చెయ్యాలని తల్లి ఆవేదన. అన్ని బీదసంసారాల్లో లాగానే, ఈ సంసారంలోకూడా ప్రతివారూ ఎప్పుడో ఏదో అదృష్టం కలిసివచ్చి తమను ఉద్ధరిస్తుందని ఆశపడేవారు. కాని ఆ అదృష్టం అనేది ఎప్పుడూ వారికి ఎడం ఎడంగానే ఉంటూవచ్చింది. ఒకసారి వాళ్ల ఊళ్లోకి ఒక నాటకసమాజం వచ్చింది. వాళ్లువేసిన నాటకాలు చూసి అపూ తన్మయుడైపోయాడు. తనుకూడా పెద్దయ్యాక నాటకసమాజాల్లో చేరిపోయి నటుడైపోవాలని కలలుకన్నాడు. అంతేకాదు, స్వయంగా ఒకనాటకం కూడా రాసేశాడు, తను చూసిన నాటకం కథ ఆధారంగా. మొత్తానికి వాడి ఆదర్శాలకు ఆకాశమే అవధి.

# ★ పథేర్ పాంచాలి ★

ఎక్కడో దేవాసురయుద్ధం ప్రారంభమయినట్లుంది. అతిచతురుడైన ఏ సేనానాయకుని అధ్వర్యంక్రిందనో, నింగినీ - నేటినీ - నేలనూ ఏకంచేస్తూ బ్రహ్మాండమైన దైత్యవాహిని అక్షౌహిణుల కక్షౌహిణులు-అదృశ్యులైన అతిరథులు - మహారథుల నాయకత్వాన ఝురీవేగాన ముందుకు పోతోంది. సుతీక్ష్ణమైన దేవేంద్రుని వజ్రాయుధం మిరుమిట్లు గొల్పుతూ క్షణంలో తిమిరసైన్యాన్నంతనీ చీల్చి చెండాడి పారేసింది. మళ్ళీ అంతలో ఎక్కడినుంచో రక్తబీజరాక్షసుని వంశీయులు కారుచీకట్లతో భూమ్యాకాశాలను ఏకం చేసేశారు.

భయంకరమైన గాలివాన:

రాత్రింబగళ్లు జుంయ్‌మని ఒకటేరొద. ఏరు పొంగి పారుతోంది. ఎన్నిచోట్ల ఎన్ని ఇళ్ళూ వాకిళ్ళూ కూలిపోయాయో! కాలువలూ, నదులూ ఏకమయాయి. గొడ్డూ-గోదా చెట్లకింద, వెదురుతోపులో, ఇళ్ళ చూరులక్రింద తడుస్తూ అలాగే నిలబడి ఉంటున్నాయి పిట్టలకూతలసేవి ఎక్కడా వినిపించటం లేదు. నాలుగయిదు రోజులు ఇలాగే ఒకేతీరున గడిచాయి. కుంభవోతగా కురుస్తున్న వర్షం - పెనుగాలి రొద తప్ప ఇంకేమీ తెలియటంలేదు. అపూ గబగబా వసారాలోకివచ్చి, తడిసిన తల తుడుచుకుంటూ "మన వెదురుతోపులోకి నీళ్లు వచ్చాయి అక్కా; చూస్తావా?" అన్నాడు. దుర్గ బొంత కప్పుకుని ఉంది. లేచి కూర్చోకుండానే "ఎన్ని నీళ్లు వచ్చాయిరా?" అని అడిగింది. "రేపు నీకు జ్వరం తగ్గాక వచ్చి చూద్దువుగానిలే. చింతతోపు దారి అంతా మోకాలిలోతు నీళ్లు." అని తర్వాత "అమ్మయేదీ?" అని అడిగాడు అపూ.

ఇంట్లో తినేందుకు యేమీలేవు. మరమరాలో యేవో కాసిని ఉన్నాయి. "ఉహూ. నాకు వద్దు అవి. నాకేం ఆకలి వెయ్యటం లేదనుకున్నావా? నాకు అన్నం కావాలి. ఊఁ. ఊఁ" అంటూ అపూ మారాం చెయ్యటం మొదలెట్టాడు.

"మా నాయనవికదూ. అలా మారాం చేస్తారా ఎక్కడైనా? నీకు కావలసినన్ని మరమరాలు మసాలా కలిపి యిస్తాగా!... ఎలా వండను చెప్పు. పొయ్యినిండా నీళ్లు నిండాయికదా." అని తల్లి పమిటచెంగు చాటునుంచి ఏదో బయటికితీసి, నవ్వు మొహంతో "ఇదిగో చూశావా ఈ చేప. మన వెదురుతోపులో తారట్లాడుతోంది. వరదనీరుకి గంగలో చేపలన్నీ కొట్టుకు వచ్చాయి చెరువులు, దొరువులు, నదులు ఏకమయిపోయాయిగా! అం చేత అన్నీ వచ్చి-" అన్నది.



"భగవాన ! నేను చచ్చిపోతే నచ్చేనష్ట మేమీ లేదు—వీళ్లను ఏం చేసిపోను ? ఈ రాత్రి ఎక్కడికని వెళ్లను!" అని మనసులో భగవంతునికి మొరపెట్టుకుంది.

"పథేర్ పాంచాలీ" బెంగాలీ చిత్రంలో జ్వరంతో పడుకున్న దుర్గను సర్వజయ ఒళ్లో పెట్టుకున్న అపూర్వకరుణామయ సన్నివేశం.

---

గుర్గ బొంతతీసి లేచి కూర్చుని, ఆశ్చర్య పోతూ—"ఏది అమ్మా చేప? అవును కాని అమ్మా, ఈ చేపలు తారట్లాడతాయా?" అని అడిగింది అపూ ఆ వానలో అలాగే తడుస్తూ పరుగెత్తబోయాడు. పట్టి బల వంతాన ఆపింది తల్లి.

"కాస్త జ్వరం తగ్గాక రేపు పొద్దున్నే నువ్వూ నేనూ వెదురుతోపులోకి పోయి చేపలు పట్టుకువద్దాం రా అపూ!" అన్నది గుర్గ మళ్లీ 'వెదురు తోపులో చేపలు ఏమిటి? ఎలా వచ్చాయి? వాహ్: అమ్మ సరిగా చూసిఉండదు. గట్టిగా వెతికితే ఇంకా దొరికేవే అక్కడ. రేపు ప్రొద్దున వెతతాను. వళ్ళి నేను చూస్తాను. ప్రొద్దుటికి జ్వరం తగ్గిపోతుంది' అనుకున్నది గుర్గ.

చుట్టూ చెట్లల్లో తోటల్లో అప్పుడే సంజెపడింది. సంజె మబ్బులు చుట్టూ చీకటిమయం చేశాయి. దుర్గ పడుకున్న పక్క మీద నే ఒక వైపున అపూ, తలీ కూర్చున్నారు. సర్వజయ ఊరికే అను కోవటం మొదలెట్టింది—"నీరేన్ తండ్రి దగ్గరనుంచి ఇవాళ ఇప్పుడే ఓ ఉత్తరం రాకూడదూ! ఏమో : అది ఇంక ముడిపడ దేమో! నీరేన్ కష్టపడే వెళ్లాడు. కాని చివరికి ఏం రాసిపెట్టిఉందో మరి! ఆ(. అంత అదృష్టం పట్టబోతుందా కూకు! అంత అదృష్టమే పడితే ఇంక కావలసింది ముంది!"

అక్కడ ఇహ అక్కతమ్ముళ్లి ముచ్చ టంపులు ప్రారంభమయేది. ఈదురుగాలికి చలి ఎక్కువవటంతో తల్లిదగ్గరకు చేరి కరుచుకు కూర్చునేవాడు అపూ నవ్వుతూ... పిల్లవాడి అమాయకపు నవ్వు సర్వజయ హృదయాన్ని ములుకు గుచ్చినట్లు బాధిం చేది—"ఇంతలూ - అంతలూ ఏం లేదు. ఉన్నది ఒక్కడూ సొంటికాయ. అదృష్టం ఎలా ఉంటుందో ఏమో! వాడు మారాం చేస్తే కాదనటానికి నోరురాదు. ఓ నెయ్యి లేదు, పెరుగు లేదు. నోరుతిపి చేసే చిరుతిండి

#  పథేర్ పాంచాలీ 

అయినా ఉండదు. నాలుగు పాడిమొతుకులయినా పెట్టేందుకు నోచుకోలేదు' అనుకుంటూ విచారపడేది. మళ్ళీ—"ఈ పడిపోయేందుకు సిద్ధంగా ఉన్న యిల్లు—ఈ జరుగుబాటులేనిసంసారం'అపూ పెద్దవాడైతే ఇంక ఈ కష్టాలుండవు భగవంతుడు వాణ్ని ఒక కంట కనిపెట్టి వృద్ధిలోకి తీసుకువస్తే-" అనుకునేది

తాను ఇహ తరతరాలనాటి కబుర్లూ చెపుతూ వాళ్ళదగ్గిరే కూర్చునేది. తాను మొదటగా నిశ్చిందిపురం కాపురానికి వచ్చినపుడు-ఒక యేడు అప్పుడూ ఇలాగే తెరిపిలేని వర్షాలు కురిసి నదులు పొంగి, రేవుకి వెళ్ళే దారిలో ఉన్న ముఖర్జీగారి తోటదగ్గర వరకూ పెద్దపెద్ద సరుకుల పడవులు కూడా వచ్చాయి-అని చెప్పింది.

"ఎంత పెద్ద పడవలమ్మా?"అని అడిగాడు అపూ.

"చాలా పెద్దవి. అదే హిందూస్తానీ వాళ్ళు సున్నపు పడవలూ, అవీ వస్తూ ఉంటాయే అప్పుడప్పుడు — అంత పెద్దది—" అని చెప్పింది సర్వజయ.

దుర్గ హఠాత్తుగా-"అమ్మా! నీకు అయిదు పాయలజడ వెయ్యటం చేతవునా?" అని అడిగింది...

ఓరాత్రివేళ సర్వజయకు నిద్ర మెళుకువ వచ్చింది—"అమ్మా! అమ్మా! నామీద నీళ్లు పడుతున్నాయమ్మా!" అని అపూ తల్లిని నిద్రలేపాడు.

సర్వజయ లేచి దీపం వెలిగించింది బయట జోరున వర్షం కురుస్తున్న ధ్వని. పైకప్పులోంచి ఇల్లంతా 'జలాజంత్రం'గా కురుస్తోంది. ఆమె ప్రక్కకు తప్పించింది పక్క. దుర్గ ఒళ్ళు తెలియని జ్వరంతో పడుకుని ఉన్నది ఒంటిమీద చెయ్యివేసి చూస్తే కప్పుకొన్న బొంత అంతా తడిసి ముద్దయి వుంది. "దుర్గా! దుర్గా! వినపడటంలా. కాస్త లేస్తావూ? పక్క ప్రక్కకు లాగుతాను. దుర్గా! చప్పున...అంతా తడిసి ముద్దయిపోయిందే" అన్నది సర్వజయ.

పిల్ల, పిల్లవాడు నిద్రపోయినా సర్వజయ కింకా నిద్రపట్టలేదు. చీకటిరాత్రి ... అందులో పైగా ఈ వర్షం! మనసు గుబగుబలాడుతోంది. ఏదో ముంచుకు రానున్నట్లు భయంవేస్తోంది!...'ఆయన ఏమయినట్లో? డబ్బుమాట తిగలేసిరి, ఉత్తరమ్కొక్కటయినా రాయలేదుకదా!ఇలా ఎన్నడయినా చేశారా? ఆయన ఒంట్లో ఏంలేకుండా కులాసాగా ఉన్నట్లేనా! తల్లీ! సిద్ధేశ్వరీ! నీకు అయిదణాల కానీ భోగం చేయిస్తాను. క్షేమంగా ఉన్నవార్త వచ్చేట్లు చెయ్యి తల్లీ!' అనుకుంది మనసులో.

మర్నాడుదయం వాన కాస్త వెనకపటినట్లుంది. సర్వజయ ఇంట్లోనుంచి బయటికివచ్చి చూసింది—వెదురుతోపులో చిన్న దొరువు నీళ్ళతో పొర్లిపోతోంది. నివారణుని తల్లి తడుస్తూ ఏటికివెళ్ళేదారినే ఎక్కడికో వెడుతోంది. సర్వజయ 'ఇదిగో' అని పిలిచిందామెని. తర్వాత మళ్ళీకొంచెం సిగ్గుపడుతూ—"మీ అబ్బాయికి 'బృందావనం కంఠువా' కావాలన్నావు కదూ మొన్న యెప్పుడో ఓసారి? కావాలా? తీసుకుంటావా?" అని అడిగింది

"ఉన్నదా? కాస్త చినకు వెలవనివ్వు, మా వాణ్ణి కూడా తీసుకుని ఇప్పుడే వస్తాను మళ్ళీ క్రొత్తదే ఉందా?పాతదా అమ్మా?" అని అడిగింది నివారణుని తల్లి.

"నువ్వే మాధ్దువుగాని రా. ఇప్పుడే వస్తావా? కొత్తపాతదే అనుకో అయితేయేం, ఎవరూ పైన వేసుకోవటం లేదు శుభ్రంగా ఉతికి మడతపెట్టి ఉంది" అని కాసేపాగి, "మీరీమధ్య వడ్లువిమీ దంచటం లేదా?" అని అడిగింది.

"ఈ ముసురులో వడ్లు ఎక్కడ ఎండుతాయి అమ్మగారూ! ఏవో తిండికోసమని కాసినిఅట్టేపెట్టుకున్న వేవో—"

"ఓ పని చేద్దూ! వాటిల్లోవే సగం నాకు ఇవ్వగలవా?" అని కొంచెం ఇవతలికి వచ్చి. ప్రతిమాలుతున్న ధోరణిలో—"వర్షం మూలంగా బజారునుంచి బియ్యం తెచ్చిపెట్టే వాళ్ళు దొరకటంలేదు డబ్బు చేత్తో పుచ్చుకుని రోజూ తిరుగుతున్నాను, ఎవరైనా తెచ్చి పెడతారేమోనని; చాలా ఇబ్బందిలో పడ్డాం—"అన్నది సర్వజయ.

నివారణుని తల్లి అందుకు ఒప్పుకుంది. "ఇప్పుడే వెళ్ళి తీసుకువస్తాను కాని ఆ ముతకబియ్యం అన్నం మీలాంటివాళ్లు తినగలరా అమ్మా! ఒట్టి ముతకబియ్యం-" అన్నది

వేపచెక్కకషాయం దుర్గ త్రాగలేకపోయిందిహ. జ్వరం అలాగే ఉంది. మందు లేదు, మాకు లేదు, వైద్యుడు లేదు, డాక్టరు లేడు. "ఒక కానీ బిస్కట్లు తెచ్చిపెట్టు అమ్మా! ఉప్పఉప్పగా ఉండే బిస్కట్లు నోటికి కాస్త రుచిగా ఉంటాయి" అన్నది దుర్గ.

నూకల జావ ఆస్కారం లేనిదానికి బిస్కట్లు!

సాయంకాలం నుంచి వాన పెద్దదయింది మళ్ళీ వానతోపాటు గాలి కూడా జాస్తి అయింది జోరున వాన. ఎక్కడా పిట లేదు చుట్టుపక్కల. ఎటు చూసినా నీళ్ళ గలగల...రయ్యమని ఒక ఈశాన్య గాలి మబ్బులతో చీకటి క్రమ్మింది సంజె పడకముందే మళ్ళీ దూదిలావిడి పోతూ నల్లటి మబ్బులు అటూఇటూ పరుగులెత్తుతున్నాయి. వర్షపు ధ్వనిలో ఏమీ వినపడటం లేదు కిటికీలోంచి గాలి వాటుకు జల్లు కూడా కొడుతోంది ఇంట్లోకి తలుపులు విరిగిపోయిన జాగాల్లో పాతగుడ్డలు అడ్డుపెడితే ఆ ప్రచండమయిన గాలి విసురును అవి ఆపగలవా?

అందరూ నిద్రపోయాక రాత్రివేళ వర్షం పెదదయింది. సర్వజయకి నిద్రపట్టలేదు - పక్కమీద కూర్చునిఉంది. బయట ఒకటే వాననీళ్ల గలగల. క్షుద్ర రాక్షసుని గర్జనలాగా వాయుగర్జనకి ఇల్లంతా దద్దరిల్లిపోతోంది పాతకొంప ఒక్కొక్క గాలి విసురుకి ఊగిసలాడుతోంది భయంతో ఆమెకి ప్రాణాలెగిరిపోతున్నాయి ఊరికే ఓ కొసను - వెదురులో పులో పనివాళ్లను పెట్టుకుని-నిస్సహాయస్థితిలోఉన్నది తాను. "భగవాన్! వెను దచ్చిపోతే వచ్చే నష


రవి టాయ్ లెట్స్- అందముకు, వర్చస్సుకు

రవి గ్లిసరిన్ సోప్:-
అన్ని కాలములలో, ముఖ్యముగా వేసవి కాలములలో వాడదగినది. శరీరమును మృదువుగను, కాంతిగను ఉంచును

రవివెజిటబుల్ హేరాయిల్:
శిరోజములను పుష్కలముగా పెంపొందించును. దాని చక్కని సన్నితమైన సువాసన అందరికీ ఆనందము కలుగచేయును.

రవి స్నో:- ముఖవర్చస్సును కాపాడి, విలాసమును పెంపొందించును.

సోల్ ఏజెంట్లు: ది న్యూ స్టార్ & కో.,
10, వైద్యనాథ మొదలి వీథి, తండియార్పేట, మద్రాసు-21

మేమీ లేదు—వీళ్లను ఏం చేసిపోను! ఈ రాత్రి ఎక్కడికని వెళ్లను!" అని మనసులో భగవంతునికి మొర పెట్టుకుంది.

"ఇల్లు కనుక పడిపోవటం అంటూ జరిగితే, ముందు బయట వసారాగోడ పడిపోతుంది అది చప్పుడు వినపడగానే పిల్లల్ని తీసుకుని, వంటఇంటి తలుపు తెరుచుకుని ఇటునుంచి బయటకి వెళ్ళిపోతాను" అనుకుంది తనలో.

ఆమె ఇంక అలా కూర్చోలేకపోయింది కొన్నాళ్లనుంచి ఏదో గడ్చారు, పుచ్చారు అంటూ కాలక్షేపం చేస్తోంది. తానిలా రోజు రోజూ ఉపవాసాలతో గడుపుతూ - ఇంట్లో కాస్త ఏదైనా ఉంటే అది పిల్లలకు పెడుతోంది దిగులుతో, ఉపవాసాలతో ఒంట్లో ఓపిక బొత్తిగా లేకుండాపోయింది

అర్ధరాత్రి అయేసరికి గాలివిసురు ఎక్కువయింది. ఎంత గాలివాన తప్పపడింది! ఏమిటి ఉపాయం! ఓ పెద్దగాలి ఊపుకి భయంవేసి, గాలిజోరు తెలుసుకోటానికి మెల్లిగా వసారా తలుపు తీసి, బయటికి తొంగిచూసింది. వాన జల్లుకి, తల, కట్టుకున్న చీర తడిసిపోయాయి గాలిహోరులో వాన కురుస్తున్న ధ్వని వినిపించకుండా పోయింది. బయట ఏమీ కన్పించటం లేదు చీకట్లో చెట్టూ, చేమలూ-భూమీ-ఆకాశం అన్నీ ఏకమైపోయాయి

ఈ క్రూరభయంకరమైన చీకటి రాత్రి ప్రళయదూతలాగా ప్రచండ వేగంతో ప్రపంచాన్నంతనీ పొట్టను పెట్టుకోవాలని పరుగులెత్తుతూ వస్తున్నట్టుంది...' ఆ దూత పెనుగాలి రెక్కలు వేసి, తన రాక్షసబలంతో సర్వజయావాళ్ల జీర్ణకుటీరాన్ని వెనుకనుంచి ఒక్క ఊపు ఊపాడు కుటీరం ఊగిసలాడిపోతోంది ఇంక నిలబడేట్టులేదు ఇంగులో తొందరపాటు కాని, పొరపాటు కాని, అనాలోచితమయింది కాని యేమీ లేదు అంతా ఓ నిర్ణీత కార్యక్రమం ప్రకారం జరుగుతున్నట్లే ఉంది. ప్రపంచాన్ని నిర్ణీత సమయంలో నిర్మూలం చేసే భారం తనపైన వేసుకున్న మహాశక్తిమంతుడైన ఆ దూత—సృష్ట్యాదినుంచీ కలలలాడుతూండే సృష్టిని ముక్కముక్కలు ధ్వంసం చేస్తూ ఆకాశంలో నిరంతరం, త్రాళ్లా చిందరవందరగా మెరుపులు పారేస్తూనే వస్తున్నాడు. ఇది అతడికి అలవాటైన పని ఇందులో అలసత్వం ఉన్నా అధైర్యం ఉన్నా శోభించదు అతడికి..

సర్వజయ భయంతో తలుపు మూసింది. చుట్టూ వెదుకుతోంది, అసలే కారిపోతూ ఉంటున్న ఇక్కడి లేదు అమ్మా! నీళ్లమీద తేలిపోతున్నట్టుంది ఇల్లు. చెయ్యి వేసి చూస్తే అప్పుడే ఒళ్లంతా తడిసి ముద్దయివుంది ఏంచేస్తుంది తాను! ఇంకా ఎంతరాత్రి ఉందో ఏమో! ఆమె చేత్తో పక్కకింద





అదృష్టమైన పిల్లవాడు!
తెలివైన తండ్రి!

ఆనందంతో కేరింతాలు కొడుతున్న పిల్లవాడు—వాని తండ్రి ఎల్లప్పుడూ జాన్సన్స్ బేబీ పౌడరు కొనును అది మెత్తగా, చల్లగా ఉండి ఆ లేత చర్మమునకు ఎంతో హాయి నిచ్చును!

Johnson's

జాన్సన్స్ బేబీ పౌడరు

ఉచితము: పిల్లల సంరక్షణను గురించిన ఉచిత యింగ్లీషు పుస్తకము కావాలని వ్రాయండి. దీనిలో తల్లి తండ్రులకు ఉపయోగపడే విషయములు ఎన్నో ఉన్నాయి.

జాన్సన్ & జాన్సన్
పి. ఓ. బాక్స్ 1976, డిపార్ట్‌మెంట్ 22 ఎ.
బొంబాయి

IB 3027

తడిమి నిప్పుపెట్టె చేతికితీసి కిరసనాయిల్ బుడ్డి వెలిగించింది. "అపూ లేవరా, లే, లేచి కూచో—" అని లేపింది అపూని.

"కాస్త పక్కకు తిరిగి పడుకో అమ్మగురు! పక్క క్రిందికి నీళ్లు వచ్చేశాయి. కొంచెం అటు జరుగు" అన్నది దుర్గతో.

అపూ లేచి కూర్చుని నిద్రకళ్ళతో ఒకసారి చుట్టూ చూసి, మళ్ళీ పడుకున్నాడు. దఢేల్ మని ఏదో చప్పుడయింది. సర్వజయా గాబుక్కున తలుపు తెరిచి బయటికి తొంగి చూసింది. వెదురుతో పైకప్పు అంతా వాలుకుంటున్నట్లుంది. వంట యింటి గోడ పడిపోయింది. ఆమెకు గుండె దఢేల్మంది. ఇహ ఈ పాత కొంపకూడా—ఎవర్ని పిలుదామన్నా ఎవరున్నారు? 'ఈ రాత్రి ఎలాగైనా గడిచేట్లు చెయ్యి పరమేశ్వరా, పిల్లల ముఖం చూసి అయినా—' అంటూ మనసులో భగవంతుని వేడుకుంది.

అప్పటికింకా బాగా తెల్లవారలేదు. గాలి తగ్గిపోయింది. కాని వాన ఇంకా సన్నజల్లు పడుతూనే వుంది. పొరుగున ఉన్న నీలమణి ముఖర్జీ భార్య పసుపులపాకలో వాటిస్థితి ఎలావుందో చూద్దామని వెడుతోంది. ఇంతలో దొడ్డివాకిలి తలుపు తడుతున్న చప్పుడు విని, తలుపు తెరుస్తూ ఆశ్చర్యపోతూ "ఎవరు? కొత్తకోడలా?" అని అడిగింది. "కాదు, నేను అక్కయ్యా, ఒక్కసారి బావగారిని పిలు. చప్పున ఒక్కసారి మా యింటికి రమ్మని చెప్పుదూ! దుర్గ ఎలాగో ఉన్నది" అన్నది సర్వజయ.

నీలమణి ముఖర్జీభార్య ఆశ్చర్యపోతూ, "దుర్గా? ఏం, దుర్గకి ఏం?" అని అడిగింది.

"కొన్నాళ్లనుంచీ జ్వరం వస్తోంది. వస్తోంది, దానంతటదే తగ్గుతోంది. మళ్ళీ వస్తోంది. మలేరియా జ్వరం. నిన్న సాయంత్రంనుంచి మరీ ఎక్కువైంది జ్వరం. దానికి తోడు నిన్న రాత్రి ఎంత విధ్వంసం జరిగిందీ తెలుసుగా! చప్పున ఒకసారి అయినా—" అన్నది సర్వజయ.

ముడి ఊడిపోయి రేగిపోయిన ఆమె జుట్టు, రాత్రంతా జాగరణవల్ల ఎర్రబడ్డ కళ్ళు, దిక్కుతోచకుండా ఉన్నట్లున్న ఆ మొఖం చూసి నీలమణి ముఖర్జీ భార్య—"భయపడతావ్ దేనికి? ఉండు. ఇప్పుడే పిలుస్తాను. నేనుకూడా వస్తాను పద... నిన్న రాత్రి మా పసుపులపాక కూడా పడిపోయింది చూశావా! నిన్న రాత్రి జరిగిన విధ్వంసం లాంటిది నేనెన్నడూ చూసి యెరుగను. తెల్లవారకట్ల గొడ్లనన్నిటినీ అక్కడినుంచి తప్పించి అవతల కట్టేసి అప్పుడు పడుకున్నాం ఇహ!... ఉండు పిలుస్తాను" అన్నది.

కాసేపటికల్లా నీలమణి ముఖర్జీ, అతని పెద్దకొడుకు ఫణి, అతడి భార్య, ఆడపిల్లలిద్దరూ—అందరూ అపూవాళ్ళ ఇంటికి వచ్చారు. రాత్రి గాఢాంధకారంలో ఆ దైత్యుడు గ్రామాన్నంతటినీ మట్టిపెట్టి ఆకాశంలో ఎక్కడో మాయమైపోయాడు. విరిగిన చెట్లకొమ్మలు, ఆకులు, పూరియిళ్ళ వాసాలు, వెదురు దుబ్బులు మొదలైనవాటితో కాలు పెట్టటానికి సందు లేకుండా వుంది దారి. గాలికి వెదురు చెట్లు దారికడ్డంగా ఒరిగిపోయాయి. "మా బాబా నాన్నా యీ విధ్వంసం! నవాబ్ గంజ్ రోడ్డుమీది చెట్ల ఆకులు, కొమ్మలు కూడా కొట్టుకువచ్చి పడ్డాయి ఇక్కడ" అన్నాడు ఫణి. నీలమణిముఖర్జీ చిన్నకొడుకు వెదురు చెట్లక్రింద చచ్చిపడివున్న పిట్టల్ని బయటికి తీశాడు.

దుర్గ పక్కదగ్గరే అపూ కూర్చుని వున్నాడు. నీలమణిముఖర్జీ ఇంట్లోకి అడుగు పెడుతూ, "ఏం జరిగిందినాయనా అపూ?" అని అడిగాడు. అపూ ముఖం ఆదుర్దాగా ఉంది. "అక్క ఏమిటో 'పిచ్చి పిచ్చి' మాటలు మాట్లాడుతోంది పెదనాన్నా!" అన్నాడు.

నీలమణి పక్క దగ్గరగా కూర్చుని, "చెయ్యి నా చేతికియ్యి... జ్వరం కాస్త ఎక్కువగానే ఉంది. అయినా ఏం భయం లేదు. ఫణీ! నువ్వు ఒకసారి చప్పున నవాబ్ గంజ్ డాక్టరు కోసం వెళ్ళిరా. ఏకంగా వెంట పెట్టుకుని తీసుకుని వచ్చెయ్" అని తర్వాత 'దుర్గా! దుర్గా!' అని పిలిచాడు. దుర్గ ఒళ్లు తెలియకుండా పడివుంది. మాటా పలుకూ ఏం లేదు. "ఈ ఇల్లా ఇదీ బాగా


మెరయుచు పొంగే పానీయము
వేసవికాలములో కలిగే
కడుపులోని అస్వస్థతలను
పోగొట్టును



వేసవికాలములో మీ కడుపులో సులభముగ అస్వస్థత కలుగును. మెరయుచు పొంగే గ్లాసెడు చల్లని ఈనో కడుపును సరిచేసి, జీర్ణకోశము చురుకుగా ఆరోగ్యవంతముగా ఉండేలా క్రమపరచును. ఈనో సౌమ్యముగ, సమర్థతతో ఆహ్లాదికృత వలన కలిగే అజీర్ణము, గుండెమంట మరియు కడుపు ఉబ్బరములకు సత్వరముగ నిశ్చయమైన ఉపశమనము కలిగించును. దానిని సరకకడుపున కొంచెము పెద్ద మోతాదు తాగితే సౌమ్యవిరేచనకారిగా పనిచేయును.

ఎంతో చల్లగా మరియు
ఆహ్లాదకరముగా ఉండును!







'ఈనో' మరియు 'ఫ్రూట్ సాల్ట్' అను మాటలు రిజిస్టరు చేయబడిన ట్రేడు మార్కులు.

ENO. 1709 (Tel.)

భీభత్సంగా ఉంది. రాత్రంతా నీళ్లలో తేలిపోయినట్లుంది... మరదలంత సిగ్గుపడాల్సిన పనేముందీ! మా ఇంటికి వచ్చివుంటే సరిపోయేదిగా. వారికి ఇహ జన్మలో సాంసారికపరిజ్ఞానం వస్తుందని తోచదు. ఈ స్థితిలో, ఈ తీరునవున్న ఇల్లు మరమ్మత్తు అయినా చేయించకుండా ఏం చేస్తున్నాడో తోచదు. మొదట్నుంచీ అంతే వాడు-" అన్నాడు నీలమణి.

"ఇల్లు మరమ్మత్తు ఏమిటి? ఇంట్లో జరుగుబాటే లేకపోతే! లేకపోతే ఇలా అర్ధాంతరంగా వదిలిపెట్టి ఎవరైనా పారుగుడొళ్లకి వెళతారా? పాపం, జబ్బుగా వున్నపిల్ల రాత్రంతా తడిసింది. కాసిని వేడినీళ్లు పెట్టి ఇయ్...ఫణీ? ఆ కిటికీ తెరు కాస్త..." అన్నది నీలమణిభార్య.

కాస్త ప్రొద్దెక్కేసరికి నవాబ్‌గంజ్ నుంచి డాక్టరు శరత్ వచ్చాడు. చూసి, పరీక్షచేసి, మందూ-అదీ ఇచ్చాడు. "పెద్ద భయపడవలసిన అవసరం ఏమీ లేదు. జ్వరం ఎక్కువగా వుంది ముఖంమీద అరగా అరగా నీళ్ళ పట్టేవేస్తూ ఉండండి" అని చెప్పి వెళ్ళాడు డాక్టరు. హరిహరు డెక్కడ ఉన్నదీ తెలియదు. అయినా పాత అడ్రెస్‌కి అతడికో ఉత్తరం రాయటం జరిగింది. మర్నాడు వాన తగ్గిపోయింది. ఆకాశంలో మబ్బులు విడిపోవడం ప్రారంభమైంది. నీలమణి రెండుపూటలా వచ్చిచూచి. కనుక్కొని వెడుతున్నాడు. వాన వెలసిన మర్నాటినుంచీ దుర్గకి మళ్ళీ జ్వరం ఎక్కువయింది. డాక్టరు శరత్‌కి కూడా ఏమీ పాలుపోలేదు. హరిహరునికి మరో ఉత్తరం వెళ్ళింది.

అపూ అక్కపక్కలో కూర్చొని ముఖం మీద నీళ్లపట్టీ వేస్తున్నాడు. ఒకటి రెండుసార్లు—"అక్కా ఎలా ఉంది? ఎలా ఉంది అక్కా?" అని పలకరించి చూశాడు. దుర్గ మగతగా పడుకొని ఉంది. పెదిమలు కదిలాయి. ఏమిటో తెలియకుండా తనలో తాను గొణుక్కుంటూ ఉంది. అపూ ఒకటి రెండుసార్లు చెవి దగ్గరగా పెట్టి ప్రయత్నించి విన్నా ఏమీ తెలియలేదు.

సాయంత్రానికి కొంత జ్వరం తగ్గింది. ఇంత సేపటికి దుర్గ మళ్ళీ కళ్లు తెరిచి చుట్టూ చూసింది. చాలా నీరసంగా ఉంది. ఊపిరి లేనట్లుగా ఏదో మాట్లాడుతుంది. శ్రద్ధగా వినకపోతే ఏం మాట్లాడుతున్నదీ తెలియడంలేదు.

తల్లి ఇంట్లో పనులు చూసుకోటానికి వెళ్ళింది. అపూ కూర్చున్నాడు అక్క దగ్గర. దుర్గ కళ్లు తెరిచి తమ్ముడికేసి చూస్తూ "ఇంకా ఎంత ప్రొద్దుందిరా?" అని అడిగింది.

"ఇంకా చాలా ప్రొద్దుంది. ఇవాళ ఎండ వచ్చింది చూశావా అక్కా? మన కొబ్బరి చెట్టుమీద ఇప్పటికీ ఇంకా ఎండ ఉంది" అన్నాడు అపూ.

కాసేపు ఇద్దరూ ఏం మాట్లాడలేదు. చాలా రోజులకి ఎండ రావటంతో అపూ సంబరపడుతున్నాడు. వాడు కిటికీలోంచి బయట ఎండలో ఉన్న చెట్టుకేసి చూస్తూ కూర్చున్నాడు.

కాసేపయాక "అపూ మాటరా, ఒక మాట"—అన్నది దుర్గ.

"ఏమిటి అక్కా?" అంటూ అపూ అక్క ముఖానికి దగ్గరగా పెట్టాడు ముఖం.

"నాకొకరోజున ఎప్పుడైనా రైలుచూపిస్తావా నువ్వు?"

"ఓ, చూపిస్తాను. నీకు నయమయాక నాన్న నడిగి మనమంతా రైలెక్కి గంగాస్నానానికి వెళ్లివద్దాం అన్నాడు అపూ...

* * *

ఆ పగలూ - రాత్రీ గడిచిపోయాయి. గాలివాన వచ్చినట్లే లేదసలు. చుట్టూ శరత్కాలపు యెండ చుర్రుమంటోంది.

ప్రొద్దున పదిగంటలప్పుడు నీలమణి ముఖర్జీ - ఏటికి స్నానానికి వెడదామని ఒంటికి నూనె రాచుకుంటూండగా భార్య కంగారుగా పిలవటం చెవిని పడింది." "ఇదుగో, చప్పున ఓసారి ఇలారండి. అపూ వాళ్ళ యింటివైపునుంచి ఏమిటో ఏడుపు విన్పిస్తున్నట్లుగా ఉంది" అన్నదామె.

ఏమిటో చూసివద్దామని అందరూ పరుగెత్తారు.

సర్వజయ కూతురి ముఖంమీద ముఖం పెట్టి "దుర్గా: ఒక్కసారి కన్నెత్తి చూడవే తల్లీ: నాతల్లీ:" అంటోంది ఏడుపు గొంతుతో.

నీలమణి ముఖర్జీ యింట్లోకి వచ్చి, "ఏమిటి? ఎలాఉంది? తప్పుకోండి ప్రక్కకి. అబ్బ! గాలి ఆడకుండా దడికట్టినట్లు నుంచున్నారంతిరూ" అన్నాడు.

సర్వజయ బావగార్లలాంటి పెద్దలంతా ఇంట్లో ఉన్నారన్న సంగతి మరచిపోయి, "అయ్యో భగవంతుడా! పిల్ల అలా అయిపోయిందేమిటో!" అంటూ రాగాలెట్టింది.

దుర్గ ఇంక కన్నెత్తి చూడలేదు.

ఆకాశంలోని నీలి మాస్తరణను భేదించుకుని అప్పుడప్పుడు అనంతునిచే సైగలువస్తూ ఉంటాయి. పృథివి ఒడిలోని బిడ్డలు తొట్రుపడి పరుగులిడిపోయి, ఆ అనంతనీలిమలో మునిగి-పరిచితమూ గతానుగతికమూ అయిన మార్గానికి చాలా దూరం అవతల అగమ్యపథంలో ఎక్కడో విలీనమైపోతారు. దుర్గ అశాంత ప్రాణాలకు - జీవితంలో అన్నిటికంటె మరీ అజ్ఞాతమైన ఆ ఆహ్వానం వచ్చింది...

అప్పుడిహ - మళ్ళీ డాక్టరుకు పిలుపు వెళ్ళింది. అతడువచ్చి, "మలేరియా లాస్ట్ స్టేజి-ఏముంది? జ్వరం తీసినట్టే తీసి, చటుక్కున హార్ట్ ఫెయిల్ అయింది. సరిగ్గా మొన్న నిలాంటికేసే ఒకటి-"అన్నాడు.

అరగంట అయేసరికల్లా వీథివద్ద అంతా పిల్లమెల్లాలో గుమిగూడారు.

(ఇంకా ఉంది)

వైబ్రా
గర్భాశయరోగ నివారిణి
Vibra
సర్వ గర్భాశయ వ్యాధులను పూర్తిగా పోగొట్టి ఆరోగ్యమును సంతానమును కలుగజేయును. అన్ని చోట్లదొరకును. సీసా రు. 2/8
కృష్ణా లేబరేటరీ, బెజవాడ

తక్కువధరలో మంచిరేడియో!
భారత్ రేడియో
ఎ.సి. కరెంటు - 3 బ్యాండ్లు - రు 185/-, 5 బ్యాండ్లు - రు 275/-
డ్రైబ్యాటరీ - 3 బ్యాండ్లు - రు 165/-
12 నెలలు గ్యారంటీ
వ్యాపారవివరములకు
రేడియో సినీ ఎక్విప్‌మెంట్సు
బకింగుహామ్‌పేట పోస్టు, విజయవాడ 2

# సింహాద్రి

పంతుల శ్రీరామశాస్త్రి

శివరామకృష్ణ సాయంకాలం ఇంటికి తిరిగి వచ్చేసరికి ఏడుగంటలయింది. అతను మామూలుకంటె హుషారుగా ఉన్నాడు; బూట్లు విప్పుతూ ఈలపాట మొదలు పెట్టేడు-సింహాద్రి తొందర చెయ్య సాగాడు "వేణ్ణీళ్లు చల్లారిపోతున్నాయి బాబూ!" అని.

శివరామకృష్ణ కొంచెం విసుగుకొన్నట్టుగా అన్నాడు. "ఏమోయి, సింహాద్రీ! నేను ఇల్లూ వాకిలీ, కావలసినవాళ్లు-అన్నిట్నీ అందర్నీ వదులుకొని, ఒంటరిగా, స్వంత కష్టంమీద బతకాలన్న ఉద్దేశంతో వచ్చి ఇక్కడ ఈ గుమాస్తా పనిలో కుదురుకున్నాను. నువ్వు నీ సంరక్షణతో నాకు ఇంటికంటె ఎక్కువ సదుపాయాలు అమర్చిపెట్టేస్తున్నావు."

"తమరికి నా సేవేటి సెయ్యగల్ను బాబూ! కొంత తానానికి నీళ్లు తోడివావంతే."

"వట్టి వేనీళ్లుతోడి ఊరుకొన్నావా? వేడినీళ్లు కాచావు. స్నానమయినా నన్ను స్వంతంగా చెయ్యనివ్వవు. ఒళ్లు తోముతుంటావు. భోజనం చేసేక నా విస్తరి నన్ను తీసుకోనివ్వవు; నా బూట్లు నన్ను తుడుచుకోనివ్వవు: నేను ఎక్కడ పారేసిన బట్టలు పుస్తకాలూ అక్కడ ఉండనివ్వవు. అన్నీ సర్దిపెడతావు; నీతో మా చెడ్డ చిక్కుగా ఉందే."

"చిక్కా? తమరికి చిక్కయితే ఒక సిలుమేనా నా కిక్కడుంటానా? తమరే ఆయాళ రిక్సాలో నా యవ్వారమంతా అడిగి, రమ్మంటే వచ్చినాను. పొమ్మంటే పోతాను. రికసా అప్పజెప్పేసి ఏ కాళీగా ఉన్న అరుగుమీద సేరినా కునుకట్టిపోతాది."

"కోపం వచ్చిందిటోయి సింహాద్రీ!"

"నాకేటి కోపం బాబూ! అందులో తమవంటి మారాజులమీద."

"నాకు డబ్బున్న మహారాజును కావాలని లేదు గాని, ఇదివరకు నీ కెన్నిమార్లు చెప్పేను; నేనేదో అంటేమాత్రం వెళ్ళిపోతాను, వెళ్లిపోతానంటే మాత్రం ఇక మీదట ఊరుకోను-నిన్నవంటే నిన్ననే నీ చదువు మొదలు పెట్టేవు- ఈ ఆదివారం నుంచీ నీ డబ్బులు కూడబెట్టడం మొదలు పెట్టాలనుకున్నాముకదా?

"ఏటో బాబూ! నా మీద అనుగ్రహం కొద్దీ తమరలా సెలవిచ్చినారుగాని, నాకు సదువెందుకు బాబూ! కాళ్లల్లో బలమున్నంతకాలం రికసా నాగుతాను. ఆయెనక తమ రంటివోరి పాదాలు పట్టుకొని బతుకుతాను; నాకేమీ తల్లా తండ్రా? నా సంపాదన వుడికి కావాలి."

"ఇదుగో సింహాద్రీ! నీ ధోరణి నాకేం నచ్చలేదు-సరే పద, స్నానం చేస్తూనే మాట్లాడుకొందాము. స్నానం చేసేంతసేపూ నాకేమయినా పనిఉంటేకదూ?

చూడు, నీకేమో కొంత అక్షరజ్ఞానం ఉంది. ఆరోగ్యంఉంది. ఇంకా వయసు ఇరవైప్రాంతంలో ఉండి ఇటువంటివాడివి అన్ని ఆశలూ అణగారిపోయిన వేదాంతిలా మాట్లాడ్డం ఏమీ బాగాలేదు.

ఏకారణంవల్లనయితేనేమి, నువ్వు నాకంటపడ్డావు. నాకూ అందరి రిక్షావాళ్ళతో ఆ క్షణానికి మాట్లాడి ఊరుకొన్నట్టు. కాకుండా నీమీద ఏదో అభిమానం కలిగింది.

నాకు, అంతగా బుద్ధిపుడితే ఇప్పుడే... .. ఊహు అది లాభంలేదు, నీకు నేను చెప్పిన షరతు ఏమిటి? నువ్వు నీ చిల్లర బకాయిలు ఈ ఆదివారంతో తెగతెంపులు చేసుకొని, ఆతరవాత రోజుకొక రూపాయిచొప్పున దాచుకోవాలి. ఎప్పుడు నువ్వు నూరురూపాయిలు పూర్తిచేసి చూపిస్తే ఆవేంటనే నీకు రిక్షా కొనిఇస్తాను. ఎవరికీ అద్దెచెల్లించవలసిన అక్కరలేకుండా నీకు చేతనయిన పని చేసుకొని సుఖంగా ఉందువుగాని...

ఏం, నీకు నామాట నచ్చినట్లు లేదు.

"నాకు రికసా కొనడానికి తమరికెందుకు కష్టంబాబూ! ఈ సిమ్మాద్రిగాడికేటి, ఎలాగో దినంగడిచిపోదా?"

"గడిచిపోతుంది, గడిచిపోతుంది- ఒక్కనాడు జ్వరంపట్టుకొందంటే అప్పుడు తెలిసివస్తుంది. అప్పుడు తిండికిలేక నలుగుర్నీ అడుక్కోడానికి నువ్వు బయలుదేరవలసి వస్తుంది చావన్నది తెలియకుండా హఠాత్తుగావస్తే అందరికీ ఇష్టమే— కాని, చచ్చిపోయేముందు పడేబాధ, అందులో తెలివి పూర్తిగాఉండి, తిండిలేక పడేబాధ సామాన్యమైనదికాదు. నిజమే, నేడు ఎందరికో నీలాటివాళ్ళకి సహాయం చెయ్యలేను- కాని, నీమటుకు నువ్వు నేను చెప్పినట్టు చదువుకొని, హాయిగా జీవనం చెయ్యగలిగితే నేనిక్కడ ఈ గుమాస్తాపనిలో ఇరుక్కొన్న కాలం వృధా పోలేదనిపిస్తుంది. ఏం అర్థమయిందా, నామాట?"

"తమరి మాటకెప్పుడూ జవదాటడు బాబూ ఈ సిమ్మాద్రి."

"అంటూనే ఉంటావు. మళ్ళీ, మరొక్క క్షణంలో "నాకేటి, ఎవరున్నారు? తల్లా, తండ్రా?" అంటావు—తల్లిదండ్రులు లేకపోతే, లేనివాళ్ళందరూ బ్రతకడంలేదూ? కాక, నీకేం మారుగ బుద్ధి వికటించలేదు కదూ. హాయిగా పెళ్ళిచేసుకొని, పెళ్లాం పిల్లలతో సుఖంగా ఉంటావు"

"నాకు పెళ్ళేటి బాబూ?"

"బియ్యే పాసయి, తొంభైరూపాయిలు జీతం తెచ్చే గుమాస్తా స్థితికంటే, నీస్థితే ఎంతోనయం; ఒక ఉద్యోగస్థుడున్నాడంటే అతనిమీద అరడజను మందయినా ఆధారపడి ఉంటారు."

"ఉండండి బాబూ! మరి రెండు చెంబుల నీళ్ళు పోసాను"

"చాలులే" అంటూ తువ్వాలుతో ఒళ్లు తుడుచుకొంటూ ఈలపాట మొదలుపెట్టాడు శివరామకృష్ణ.

ఇవాళ ఎలాగయ్యా అతని ధోరణి కొంచెం హుషారుగా వుంది.

ఒళ్లుతుడుచుకోడం పూర్తిచేసి, సింహాద్రి అందిచ్చిన మడతలుంగీ కట్టుకొని, గదిలోనికెళ్ళి బనియను తొడుక్కుని తల దువ్వుకొంటూ సింహాద్రిని కేక వేసేడు.

అద్దంలో మొగాన్ని వివిధ భంగిమాలలో చూసుకొంటూ సింహాద్రిని ప్రశ్నించాడు.

"చూడు, సింహాద్రీ, నా మొగం ఎలాగుంది?"



గోదావరి పుష్కరాలకు ఇరవైలక్షలమంది జనులు వచ్చారని అంచనా.
రేవులో స్నానం చేస్తున్న యాత్రికుల దృశ్యం.

ఫొటో: ఎ. వి. వి. నరసింగరావు—రాజమండ్రి.

"ఎలా గిటే బాబూ! సందమావలాగుంది"

"ఏమిటోయి కవిత్వం మొదలు పెడుతున్నట్టున్నావు. మగవాళ్ళ మొగాలను చంద్రుడితో పోల్చిన మొట్ట మొదటి జానపద కవి నాకు తెలిసినంతవరకూ నువ్వే—సరే కవిత్వం మాటకేం, పోనీ, నా మొగం మాస్తే ఏం అసహ్యం కలగడం లేదుకదా! మరి మాసేవా? ఈ సాయంత్రం ఒకరు నన్ను నా మొగంకేసి చూస్తూనే 'బ్రూట్' అన్నారోయి"

"ఏటి బాబూ! అంతమాటపడి ఊరుకున్నారా?— చెప్పుతీసి కొట్టలేకపోయినారా?"

"నువ్వయితే అంతపని చేద్దువు కాబోలు; నేను నవ్వుకొని వచ్చేశాను—ఆమనిషి ఫోటో మాపాత కేరాలో ఉంది. తిరవాత డెవలప్ చేసి చూపిస్తాను."

"ఫోటోవు మాస్తే ఏటీ తెలుస్తాది బాబూ! మనిసినే ఒక్కపాలి మా పెట్టండి; బూటూ గిటూ యెగిరిపోతే నాగపాలు సిచ్చుకోంటాను."

"ఎందుకోయి, అంతకోపం; సరే గాని, నిన్నెవరైనా అంటే కూడా అంతే చేస్తావన్న మాట?"

"నా నాటి రికసా నాగే ఓడికేటి బాబూ! డబ్బిచ్చే గోజులు నాలుగన్నా పడుండాలి—తిమురంటోరిని...

"నా ఎక్కువేమిటిలేగాని, ... అయితే నన్ను అవిధంగా అన్న మనిషి మగవాడు కాకపోతే, అప్పుడు కూడా నువ్వు పోట్లాడానికి సిద్ధమేనా?

"తమరంతా ఇచిత్రం బాబూ!"

"ఇందులో చిత్రం ఏమి లేదోయి! నన్ను అలా అన్నది మగవాడు కాదు. ఒక అమ్మాయ్; మరి నువ్వు ఇందాకటి మాట మీద నిలబడతావా?"

"ఆడదానిమీద సెయ్యి సేసుకోనేమా? కే.

"అయితే నువ్వు ఆడవాళ్ళమీద చెయ్యి చేసుకోవన్న మాట? మరయితే నా అవమానం ఎలా పోతుంది?"

"ఆయమ్మ ధరతినో, అయ్యనో, చెప్పండి."

"బాగు, బాగు, ఆమె అన్నమాటకి మర్యాని ఏమీ ఎరగని మరెవళ్లనో తంతావా? నన్ను' అన్నదానికి నువ్వు పోట్లాటకి వెళ్ళడం బాగుందా? ఆమెకి కావలసిన వాళ్ళని తన్నడం బాగులేదా? కాని, మాను, సింహాద్రి, ఆవిడికింకా పెళ్ళి కాలేదు. అంచేత భర్త లేడు—తండ్రి ఉన్నాడనుకో; అయితే ఆయన ముసలాడు తిన్నగా నడవనైనా లేడు అటువంటివాణ్ణి తంతే ఏం గొప్ప—"

"మరేటి సెయ్యమంటారు బాబూ!"

"ఇప్పుడేమీ చెయ్యనక్కరలేదు గాని, ఒక్కమాట అడుగుతాను, చెప్తావు?"

"ఏటిబాబూ?"

"నువ్వు ఎప్పుడైనా ప్రేమలో పడ్డావా? అంటే ఎవళ్ళయినా పిల్లను

## ★ సిమ్మాద్రి ★

"చూసి, ఆమెతో మాట్లాడ్డం సరదాగా ఉండేదా? నీకిప్పుడు సుమారు ఇరవై ఏళ్ళుంటాయి కదా? ఇదివర కెప్పుడూ ఇలా అనిపించలేదా? నువ్విక్కడికి వచ్చి ఆర్నెల్లేకద అయింది, మీ వాళ్ళెప్పుడూ నీకు పెళ్ళి చేస్తామనలేదా?"

"ఏటో బాబూ, మానాటోళ్ళ గోసతమ కెందుకు?"

"మళ్ళీ నీ ధోరణిలో పడుతున్నావు-చదువుడబ్బూ లేకపోతే మాత్రం నువ్వు మనిషివి కావా? మరిలాగ పిచ్చి పిచ్చి కబుర్లు చెప్తే లాభం లేదు. రోజూ నన్ను నిద్ర పోనివ్వకుండా కథలు చెప్పమని చంపుతున్నావు-నాకు వచ్చిన కాశీమజిలీల కథలూ, అరేబియన్ నైట్సు కథలూ అయిపోవచ్చాయి-తక్కిన పుస్తకాలలో ప్రత్యేకించి కథ చెప్పడానికి ఆస్కే ఉండదు. చదువుకొని ఆనందించవలసిందే—అంచేత, ఇవాళ రాత్రి నీ పుట్టు పూర్వోత్తరాలన్నీ వివరంగా చెప్పాలి."

"చెప్పినానుకొను బాబూ, తల్లీ దండ్రీ లేనోణ్ణి; కడుపు బాధకి పట్టమొచ్చినాను. రికసా నాగుతున్నాను."

"నువ్వు సరిగా చెప్పడం లేదు! మీ తల్లిదండ్రులు నీ చిన్న తనంలోనే పోయేరన్నావు. ఒక మారు మాటల సందర్భంలో-మరి, ఇంతకాలం ఊరుకొని, ఇటీవలే పట్నం ఎందుకు రావలసి వచ్చింది-నిజంగా తెలుసుకోవాలనే అడుగుతున్నాను."

"ఏటి చెప్పను బాబూ! మా వూరు అమ్మోరి గుడికాడ నిలబడి ఒట్టేసుకొన్నాను బాబూ, ఈ జనమలో తిరిగి ఎళ్ళనని."

"ఒట్టు సంగతి సరేలే—అసలు అంతగా పట్టుదల ఎందుకు కలగవలసివచ్చిందో చెప్పు నాకింకా ఆకలిగా లేదు. మరొక గంట పోయి చేస్తాను- ఆ కోటు జేబులో సిగరెట్టు పెట్టె అగ్గిపెట్టె ఉంటాయ్, యిలా పడీ—ఊఁ కానీ, నాతో చెప్తే నీకూ మనసుకి కొంత బాగుంటుంది - ఈ పట్నవాసం మాటల్తో అక్కరలేదు. మీ పల్లెటూళ్ళో మీరు మామూలుగా మాట్లాడుకొనేలాగే, నీవంటి వాడే ఇంకొక స్నేహితుడితో చెప్తున్నట్టుగా చెప్తే చాలును—"

* * *

నాను అయిదేళ్ళ గుంటణ్ణి - మా యమ్మకి అమ్మోరు (మసూచికము) ఒచ్చి పోనాది. మా యయ్య నాకు పది సంవ త్సరా లొచ్చినదాకా ఉన్నాడు. ఒకపాలి కరణంగోరి పార్టీకి మునసబుగోరి పార్టీకి కయ్యమయింది-పోలీసోళ్ళొచ్చి మా యయ్యనీ, మరి పదిమందినీ పట్టుకుపోనారు. మా పెద్దన్నకి పెళ్ళాళ్ళు పోయినాక పట్టంనించి కబురెట్టినారు. అడు ఏడుస్తా తిరిగొచ్చినాడు - మా యయ్యని, ఖయిదులో పెట్టినకాణ్ణించి, తిండి ముట్టుకోనేదట. లేపు వచ్చిపోతాడంటే ఈయాళ అక్కడ ఆసుపత్రిలో ఏసినారట. అక్కడే దిగనం చేసేనాడట.

మా పెద్దన్న ధరమరాజులాటోడు; అడి మాటంటే పెద్ద పెద్దోళ్ళకి కూడా భయరే. అడికి చదువంటే కొంతొచ్చును, గాని, అడి గ్నానం మాగొప్పది. అడికి రాని పురాణం కతంటూ నేదు. భామ్మర్లకం టె సొచ్ఛంగా ఉంటాడు; అడి మాటే ఏరు - నన్నొక్కడు పల్లెత్తుమాటనోడు కాడు. నాను పని చేస్తాంటే, పెద్దోళ్ళం మేవుఁ ఉండగా నీకెందుకురా ఇంత కష్టం సిమ్మాద్రీ అనేవాడు.

అడికి తగింకే బాబు మా పెద్దొదిన. సీతమ్మవోరునాటిది. మా యమ్మ పోయినకాణ్ణించి తనే నన్ను తలినాగ చూసేది. అన్నీ నాకు ముందెట్టి, ఆయెనక తన పిల్లల కెట్టుకొనేది.

మా పెద్దన్నకీ మా చిన్నన్నకీ చుక్కెదురు. అ డెప్పుడూ పనికి దొంగే - సిన్నప్పటికాణ్ణించి, రౌడీఎదవలతో కలిసి, జూదమాడడం, దొంగతనంగా అయీ ఇయీ అమ్ముకొని పట్నఁవెళ్ళి జలసా సెయ్యడం ఇంతే అడి పని. అడు చేసిన ఎదవపనికి ఊళ్ళోవోళ్ళు మా పెద్దన్న మొగం చూసి ఊరుకొనేవోరు. తమరినాటి పెద్దోళ్ళు పెళ్ళిచేస్తే దార్లోకొత్తాడంటే, ఒరసకి మాయక్క అవుతుంది సెండి. వరసమ్మ, మావూరే. ఆళ్ళ పిల్ల పైడమ్మ నిస్తామంటే ఈడికి పనికొచ్చింది కాదు. పల్లెటూరిపిల్ల కేటిసోకు తెలుస్తాది; పట్నంగుంట కావాలన్నాడు. మా పెద్దన్న సూన్నాడు, నువ్వేటిమహా పట్నపోడివా, నాల్రోడుక్కని, సిగరెట్సుకాలిస్తే మాత్రం, నిన్నే పట్నంపిల్ల వొలుస్తుందిరా? నీవే పల్లెటూరిపిల్ల అక్కర్లేకపోతే, పట్నంపిల్లలకి నీవు కావాలా అని—మా చిన్నన్న గర్రా ఏటి చెప్పను. "పోస్, ఈళ్ళా నా పెళ్ళి సేసేవాళ్ళు, నా పెళ్ళి నానే చేసుకొంటాను" అన్నాడు—

ఆడికి తగిందాయ్ దొరికింది - కాకినాడ పెద్దముక్కా అదీని — పేరు గొప్ప ఊరు దిబ్బ అన్నట్టు దానిపేరు కనకమట-కనకమంటే బంగారం కాదు బాబూ. మా పైడమ్మని ఒల్లనని, దాని కాలిగోరుకిపోలని ఈ కాకినాటి పట్నపుగుంటని తెచ్చినాడు-పోనీ, ఎవులయితేం, దాన్నే పెళ్లి చేసుకోరా అన్నాడు మా పెద్దన్న—నాయివాహం పట్నంలోనే, దాని కన్నోరింటికాడనై పోనాది అన్నాడు. ఒచ్చినకాణ్ణించి ఒకటే ఇకఇకలు, పకపకలు — మంచి కోతలు నూర్పులు ఏళకికూడా పన్లోకి ఒచ్చేవోదు కాదు—అయినా మా పెద్దన్న ఏటీ అనోడు కాదు—చిన్నగుంటల్లే, సరదాగా ఉండనీ అన్నాడు—

రూపుకి కాకేగాని, మా చిన్నొదినకి ఎంసోకు. తమరు గెడ్డంగీసుకుని రాసుకుంటారు, తెల్లటిముద్ద అది ఇంత మొగానికి అంటిరాచుకొని, పగటివేసగాళ్ళ నాగ ఇంత పిండి రాసుకొని, ఎర్రగుడ్డ పీలికలు కట్టుకొని రెండు జటలేసుకొని, మొగోడికన్నా, మొగోడినాగ గర్రాగా తిరిగేది. వోరం వోరం పట్నం పారిపోయోరు సినీమాకి— ఇన్ని సోకులు చేసేబాబూ మా యూరు ఆడోళ్ళు చుట్టకాలుస్తే అదీ అడ్డపొగట్టి


మీ బిడ్డ...
1, 3 సంవత్సరముల మధ్య, శాఖాహారులైన మగ బిడ్డలలో, లివర్ వ్యాధులు సామాన్యమని, మా లెక్కలవల్ల తెలుచున్నది.
తరుచుగ అజీర్ణ వ్యాధులు, కడుపు ఉబ్బరము, చికాకు పడుట, కోపము, ఆకలి మందగించుట మొదలైన గుణములు లివర్ వ్యాధిని సూచించు లక్షణములు.
వకాలంలో జమ్మివారిని సలహా తేయండి.
జమ్మీస్
లివర్‌క్యూర్
JAMMI'S Livercure
బిడ్డల లివర్ & ప్లీహ వ్యాధులకు
JVZ-13 TG
జమ్మి వెంకటరమణయ్యా & సన్స్
జమ్మి బిల్డింగ్స్, మైలాపూర్, మద్రాసు-4.
బ్రాంచీలు: విజయవాడ, తారంటారి వీధి, గవర్నరుపేట. విజయనగరము ఎదురు. కుడుగుంటవారి వీధి.

## ఇప్పుడు రెక్సోనాలో ఏదో క్రొత్త మార్పు ఉన్నది !

అది...

ఎంతో ఎక్కువ...

సువాసనైనది !




రెక్సోనా సబ్బు —
చాలాకాలము నిలవుండే
హాయి కొరకు ఇప్పుడు ఇంకా —
మరీ యెక్కువ
పరిమళమును
గలిగియున్నది !

RP 143-X52 TL

రెక్సోనా ప్రొప్రయిటరీ లిమిటెడ్, వారి తరఫున భారతదేశంలో తయారుచేయబడినది.

 సిమ్మాద్రి 

కాల్చేది. ఏటె, అంటె, నా కేటి నాకు మా త్తిరం నాయిరాల్ని గానా అనేది.

మా చిన్నన్నకి సెప్పి సెప్పి, ఏరుపరచినాది. ఇంటికి అడ్డంగా గోడేటినారు— ఆడిచేత కాఫీకబ్బు ఎట్టించినాది. పనంతా ఆడిది, గల్లాపెట్టి కాడకూకొని, కిల్లీ ఏసుకోని. ఒచ్చీపోయీవాళ్ళతో పరాసకాలాడ్డం దానిపని-అళ్ళయ్యకి పట్టంలో కిల్లీకొట్టుందిటబాబూ — సిన్నప్పటకాణ్ణించి దాని యవ్వారమే అంత—

మా సిన్నన్నకి కూడుకూడా కరువయిపోనాది. ఆ ఇడ్డెన్లు, అట్లు తిని పడుండాడు.

ఆడికొక్కడికి తెల్దుగాని, ఆడు పట్టం సామాన్లు తేడానికి ఎళ్ళినప్పుడల్లా, ఎంకటసామి అని పటాలాని కొల్లొచ్చి నాకు లెండి. ఆడు దీనికాడచేగేవోడు—ఆడడిగినప్పుడల్లా ఆడికి తాగడానికి డబ్బు లిచ్చేది. కాఫీ, ఇడ్డెన్లు ఊటికి నెక్క నేదు—

ఒకపాలి మా సిన్నన్న ఊళ్లో నేడు; ఎంకటసామిగాణ్ణి పోలీసులొచ్చి పట్టుకుపోనారు తాగి తందనాలాడితే —

మా పెద్దన్నా వదినా పురాణం ఇంటానికి ఎళ్ళినారు—సుంటలు తొంగున్నారు. నాకు కునుకు పట్టక హరీ హరీ నారాయణ పదం పాడుకొంటున్నాను—

గోడకవతల కాడనుంచి, మా సిన్నొదిన అరిచింది "అమ్మో, తేలు కుట్టేసినాద్రో, బాద సంపేస్తన్నా"దని. అంతే కావాలిలే అనుకోని, నాను సల్లగా పదం పాడుకుంటన్నాను. గోడకాడికొచ్చి "సిమ్మాద్రీ, బాద సచ్చిపోతున్నాను, తేలు" అంది.

"బాధయితే ఆచ్చారుగారి కాడికెళ్ళి మంతరం ఏయించుకో" అన్నాను—"తేలింకా అక్కడేఉంది. ఒచ్చి సంపెద్దూ, నాకు బయం" అంది—బుద్ది గడ్డితిని దాని మాట నమ్మి ఎళ్ళినానుబాబూ! ఇక్కడే ఈ మూల, కాదు కాదు ఈ మూల, అహాఁ ఈ మంచంమీద—ఇలాగే ఇల్లంతా తిప్పినాది. నాకు మా సెడ్డకోపంవొచ్చింది: "నీ పట్టం ఏసాలు నాకాడకాదు. ఏదీ, నిన్ను నిజంగా తేలుకుట్టిందా, ఎక్కడ కుట్టిందని" అన్నాను.—

"నాబాద నీకేటి తెలుసును, ఇదుగో" అని సెయ్యిసూపింది. ఏటి కనబడలేదంటే తేలుకాటు కనిపిస్తాదా అంది—కనిపించకపోతే, కూర్చో, సెయ్యిల్లా రాగాలెట్టి ఏసు, అనినాను. మా యింటి కొస్తాఉంటే సెయ్యిపట్టుకోని, "నామాట నమ్మవుకదూ, ఎక్కడబాధో సూపెడతాను" అని మంచం మీద కూకోబెట్టి రైక ఇప్పడం మొదలెట్టినాది—నాకు యాదేడ అసయ్యం ఏసినాది. "ఛీ!, ఇదా నీ ఎదవబుద్ది" అని నేను లేచిపోనాను.—గట్టిగా పట్టుకోని ఎళ్ళబడ్డాది; పిల్లిలాగ పట్టుకుని ఒదలదు—నాకు మా సెడ్డ కోపమొచ్చిపోనాది, "నువ్వెంత సెడ్డా, వండవయిపోయినా, మా యన్న పెళ్లానివని ఆగినాను—ఒదుల్తావా, నేను లేచి పొమ్మమన్నావా" అన్నాను. ఎలాగో ఒదుల్చుకోని దువ్వారంకాడికొచ్చినాను—మళ్ళీ కాళ్ళట్టుకోని, "నీ పెద్దొదినిపాటి సేసినాను గాదా, దాని యవ్వారం నీ యవ్వారం." మరి నాకు కోపం ఆగిందికాదు బాబూ; ఎనక్కి గట్టిగాతిన్ని, "సీతొమ్మపోయపాటి దాన్ని, ఏమంటే పురుగులుపడిపోతావు నంజా!" అన్నాను — కుక్కలాగ కాలు మీద కరిచినాది. ఆ మచ్చింకా మాయలేదు బాబూ—

మర్నాడు పెందాలే మా పెద్దన్న రాముఁలోరి పటానికి దండవేట్టుకొంటన్నాడు. నేను సల్లంది తింటన్నాను—మా వొదిన మజ్జిగ చేస్తన్నాది—మా సిన్నన్న పిచ్చియీరుడిలాగ వొచ్చి నా మీద కలబడ్డాడు. నేను, ఏటిరా, నీకేటి మతిపోయిందా అన్నాను — ఇంతలో మా పెద్దన్నొచ్చినాడు. మా సిన్నన్న మరీ రెగిపోనాడు— "ఇయాళ ఈడి రకతం కళ్ళజూస్తానన్నాడు—నేను లేచి నిలబడ్డాను—

ఆడు కూసినకూతలు ఏటి సెప్పను బాబూ! మా పెద్దన్న బుద్ది సెప్పబోతే, "ఎళ్లిపోయి, నిన్నిపుడడిగేదు. నీ కిష్టమయితే నీ పెళ్ళాన్నిచ్చుకుంటావు, నా పెళ్ళాం మీదికి సంపిస్తావా, నాను లేకపోడందాసి ఈయాళ..."

"నాకు మరి పోట్టు తెలిసిందికాదు బాబూ—ఎగిరి ఒక్క తాపు తన్నినాను—దబ్బని ఎల్లకిలాపడ్డాడు. ఆడింకా ఏదో పాగుతన్నాడు. ఆడి పెళ్ళాం కేక లేసి అందర్నీ పిలుస్తన్నాది. ఆడు మళ్ళీ మా పెద్దన్నని ఒదిననీ తిట్టడం మొదలుపెట్టినాడు. దవడమీద ఒక్కటిచ్చుకున్నాను. భూమిఁ పచ్చగయిపోనాది; ఇద్దరూ ఇంట్లోకి దూరిపోనారు. పదిమందీ చేరినాక ఏడుసుకొంటూ ఒచ్చి, మా సదాచారి నాగకబుర్లు చెప్పినాడు. ఆ దొంగనంజ రేత్తిరి నాను ఇంట్లో జొరబడి, బలిమిడి దాని మానబంగం సేసినానని, అంపరిముందు ఏడిసినాదిబాబూ; భగవంతుడు సెడుబుద్దులు గలోళ్ళకి సిగా నజ్జా [illegible]యినా ఇయ్యడు.

నాను ఏటి జరిగిందో అంతా చెప్పినాను. అళ్ళు కరణంగోరికాడికి మునసబుగోరికాడికి ఎళ్ళి సెప్పినారు కేసెట్టించమని. కరణంగోరు మహా సెమత్కారం మణిసి బాబూ! "మీ తమ్ముడొక్కడిమీదా ఎందుకురా, మరి నావలో జూలుపోతే ఊళ్లోని సంటలందరిమీదా కేసెట్టడువు గానిలే—రపటికాణ్ణించి నీ పెళ్లాం ఇంట్లో తిన్నగా ఉండాలి-గల్లాపెట్టి దగిర కూచోని సరసాలాడితే నువ్వు అదీకూడా ఈ ఊళ్లో ఉండలేరు, అన్నారు బాబూ! ఆళ్ళెం కూసినా ఊళ్ళో అందరికీ మాయన్న ఎలాంటోడో, నా వొదిన ఎలాటిదో, నా సెలాంటోడో తెలుసును బాబూ! అయితే, నా మనసుకి నాకే ఇచ్చారం ఏసినాది బాబూ. నాలించి, మా తల్లిలాటి ఒదిన అంత మాటకొచ్చెనా అని, మద్దినేళంతా ఏటి తోదక కూచున్నాను; సెయ్యి కునుకు పట నేదు; కోడికూతేళప్పుడు నేచి, అమ్మోరు గుడికాడికెళ్ళి ఒట్టేట్టుకొన్నాను. తెల్లారుతాండగా రైలు టేసను కొచ్చి, రైలెక్కిపోనాను. రైల్లో ఈ యాపాల్లో పనిచేస్తన్నారట పంతులుగారెవరో, ఇక్కడ రికసా నాకుకొంటే గడిచిపోతాదన్నారు బాబూ.

ఇది బాబూ ఈ సిమ్మాద్రిగాడి కత! ఏటనుకున్నావో, మా యన్న ఒదినాను, నాను సెప్పకుండా సెయ్యకుండా పారొచ్చిందందుకు - నాకు గ్యాపకమొచ్చిం కాణ్ణించి అళ్ళే నాకు తల్లి తండ్రీ — నా నుండీ అళ్ళకి అయినాను కాను బాబూ."

"ఛ, సింహాద్రి, ఏడుస్తున్నావా! నువ్వ బాగుండితే వాళ్లకు డబ్బు పంపించొచ్చును: వాళ్లినే కావాలంటే ని దగ్గరకి తెచ్చుకోవచ్చును-లేలే, భోజనం చేద్దాం"-అన్నాను

శివరామకృష్ణ. 


సుగంధికా సరస్వతీ తైలము

మెదడుకు, చల్లదనముకు, కన్ను, ముక్కు, చెవి, వ్యాధులకు, 32 సం॥ నుండి ప్రపంచమంతటా వాడుచున్నారు ఒకసారివాడిన తెలియును. మీ పెద్దడీలర్లఅందరి వద్ద దొరుకును.

ఈష్టర్న్ మెడికల్ వర్క్సు, కాకినాడ.

డిస్ట్రిబ్యూటర్లు: సీతారాంజనరల్ స్టోర్సు (ఏజెన్సీస్,) విజయవాడ-1.

# నీతిలేని మానవులు

సోమసుందరం భోంచేసివచ్చి ప్రక్క మీద తృప్తిగా పడుకున్నాడు. సావిట్లో కాబోయే అల్లుడు, వియ్యంకుడు విశ్రాంతి తీసుకుంటున్నారు.

ఇన్నాళ్ళ బరువుభారాన్ని తాత్కాలికంగా త్రెంచుకుని సోమసుందరం మనస్సు పరవళ్ళు త్రొక్కింది. హేమకు ఈ రోజు 'ప్రధానం' జరిగింది — అంటే సగం పెళ్ళి జరిగినట్టే. ఇంక హేమ పెళ్ళివిషయంలో సోమసుందరాని కేలాంటి చీకు, చింతా, పెట్టుకోవాల్సిన అవసరం వుండదు. సోమసుందరానికి గుండెలమీద కొండంత బరువు దాదాపు తొలిగినట్టయి మనస్సు తేలిక పడింది. హాయిగా వూపిరిపీల్చి సంతృప్తి హృదయంతో సాగిలపడ్డాడు సోమసుందరం.

హేమను పెళ్ళిచేయాలని ఇప్పటికెన్నాళ్ళనించో సోమసుందరం సంకల్పం. అయినా ఈనాటివరకూ ఏ సంబంధాన్నీ స్థిరపరచలేక సోమసుందరం చిత్తక్షోభతో మనశ్శాంతిని కోల్పోతూవచ్చాడు. సోమసుందరం ఆస్తిపాస్తులు వున్నవాడేం కాదు. వస్తుల బారినుండి రక్షించి అర్థాకలితో అసువులు నిలబెట్టున్న తన గుమాస్తా వుద్యోగం, తండ్రి తాతలు సంపాయించిపెట్టిన చిన్న కొంపా తప్ప సోమసుందరానికి వూచిక వుల్లైనా లేదు. అందుకే సోమసుందరం పెళ్ళికొడుకు తరపువాళ్ళు కోరే కట్నం, కానుకలవిషయంలో చాలా గాబరా పడ్డాడు. పెద్దకూతురు శారద పెళ్ళికి సోమసుందరం ఇంత ఆయాసపడే అవసరం లేకపోయింది. అయినా ఆరోజులే వేరు! సోమసుందరం ఇచ్చిన కాసింత కట్నమూ తీసుకుని ఎలాంటి పేచీలు లేకుండా శారదమెళ్ళో పుస్తెకట్టేడు పెళ్ళికొడుకు. ఏదో వుద్యోగం చేసి తన భార్యా, పిల్లల్నీ తను పోషించుకుంటున్నాడు.

ఎంత చిత్రంగా మారిపోయాయి రోజులు! చదువు సంధ్యారాని అప్రయోజకుడికికూడా ఎంతెంతో కట్నం కావాలి! దీంతో సోమసుందరం గుండెల్లో రాయి పడింది. మనస్సులో బెంగ వున్నతమై స్థిరంగా నిలిచిపోయింది. చూస్తూ, చూస్తూ హేమనో అప్రయోజకుడికెలా అంటగట్టటం? ప్రయోజకుడైనవాడు అందరాని అంతరిక్షంలోనే ప్రత్యక్షం!

హేమ అదృష్టంవల్ల నైతేనేమీ, సోమసుందరం రెండువేల కట్నం సమర్పించటానికంగీకరించటాన్నైమి మొత్తానికి సంబంధం స్థిరపడింది. ఆస్తిపాస్తులు లేవుకాని పెళ్ళికొడుకు లాయర్ చేస్తున్నాడు.

"అంత కట్నం ఎక్కడనుంచి తెస్తారు?" అనడిగింది సోమసుందరం భార్య కట్నం విషయం విని విస్తుపోతూ.

సోమసుందరం నిట్టూర్చాడు. "చూస్తూనే వున్నావుగా. మనతో సంబంధం చేయటానికే ఎవరూ ముందుకు రావటంలేదు. ఎలాగో రెండువేలూ ఇచ్చుకున్నామా హేమ లాయర్ భార్య అయిపోతుంది. ఈ కట్నం ఇవ్వటానికి వెనుదీశామా—హేమ నో అప్రయోజకుడి చేతిలో పెట్టాల్సివస్తుంది. హేమ జీవితం ఏ ఒడుదుడుకులూ లేకుండా హాయిగా ప్రశాంతంగా గడిచిపోవాలంటే, ఇంతకుమించి ఏమార్గమూ లేదు."

సోమసుందరం భార్య మళ్ళా నోరెత్తి ఆ ప్రస్తావన తీసుకురాలేదు.

త్వరలో హేమ పెళ్ళిచేసేస్తే ఆ తర్వాత తన గతి ఎలాగైనా పర్వాలేదు. తల తాకట్టు పెట్టైనా రెండువేలు తీసుకురావటానికి సిద్ధంగావున్నాడు తను. తన పేదరికం హేమజీవితాని కెట్టి అపకారం చెయ్యకుండావుండటమే కావల్సింది!

"టక్, టక్" జోళ్ళ శబ్దం విని సోమసుందరం తలపులబరువుతో మూతపడ్డ కళ్ళను మెల్లిగా తెరిచాడు.

కాస్సేపు నిదానించిచూసి "అరె నువ్వా మూర్తి! రా, రా" అంటూ తలవని తలంపుగా మూర్తి రావటంతో కల్గిన సంభ్రమాశ్చర్యాలను వ్యక్తంచేస్తూ మంచం దిగి ఒక్క ఉదుటున లేచాడు. లోపలికి తీసుకొచ్చి, కూర్చోబెట్టాడు. మూర్తిని కుశల ప్రశ్నలు అడిగాడు సోమసుందరం. చాలా రోజుల తర్వాత కలుసుకున్న ప్రాణ స్నేహితులవటం మూలాన్న, ఇద్దరూ ఆప్యాయంగా ఎంతోసేపు కబుర్లు చెప్పుకున్నారు.

"అయితే! ఇంతకూ, ఎందుకొచ్చినట్టూ—ఏం కథ" అనడిగాడు సోమసుందరం మూర్తి భుజం మీద చేయి వేస్తూ.

మూర్తి నవ్వాడు "కథ కేం లేదు. మా పెద్దబ్బాయి ఇంటర్ ప్యాసయ్యాడు ఇక్కడ ఆనర్సులో చేరతానంటున్నాడు. అదేదో కాస్త ప్రయత్నం చేసుకుందామని."

ఆ పైన సంభాషణ పిల్లల మీద నడిచింది. మూర్తికి ఒక కూతురూ, ఇద్దరు కొడుకులు. కూతురు శైలజ అందరికంటె పెద్దది. ఎం.ఏ., ఈ సంవత్సరమే ప్యాసయ్యిందిట. సంబంధాలు వెతుకుతున్నాడట. ఈ సంవత్సరం ఏదో ఒకటి చూసి, శైలజ పెళ్ళి చెయ్యక తప్పదని చెప్పాడు మూర్తి.

సోమసుందరానికి ఇంతవరకూ మరుగుపడిన హేమ "ప్రధానం" సంగతి దప్పున స్ఫురణకు వచ్చింది. తన ఆనందాన్ని పంచుకోగల స్నేహితుడొకడు దొరికినందుకు సోమసుందరం చాలా సంతోషించాడు.

"మా అమ్మాయి హేమకు ఈ రోజే ప్రధాన మయ్యిందిరా–"

మూర్తి మలినమైన ముఖాన్ని చూసి సోమసుందరం చకితుడయ్యాడు.

"అహా - అలాగా - చాలా సంతోషం! ఇంతసేపూ చెప్పావు కాదేం! పెళ్ళికొడుకు ఏం చేస్తున్నాడు?" మూర్తి తన సంతోషం సూచిస్తూ సోమసుందరం బుజాల్ని పట్టుకుని వూపాడు.

మూర్తి ప్రఫుల్ల వదనంచూసి సోమసుందరం ఉత్సాహం యినుమడించింది.

మందరపు పద్మ, లలిత

# ★ నీతిలేని మానవులు ★

"పెళ్ళికొడుకు ఎం. ఏ. ఎం. ఎల్. చదివి ప్లీడరు చేస్తున్నాడు."

మూర్తి ఆశ్చర్యంతో తృళ్ళిపడి మంచం మీంచి కిందకు ఒక్క గంతేశాడు.

"ఎం. ఏ. ఎం. ఎల్! మై గాడ్! ఏమిటే - నిజమే! మీ అమ్మాయికా... మీ అమ్మాయికా?"

సోమసుందరం మనస్సు తీవ్రంగా గాయపడ్డది.

"ఏం! మా అమ్మాయి నెందుకు చేసుకోకూడదు?" అన్నాడు సోమసుందరం చిన్నబోయిన ముఖంతో.

మూర్తి పకపక నవ్వి "ఏడిశావులే - నీ అర్థాలు నువ్వూను. పెద్దవాడివైనా పెడబుద్ధులు పోలా. అంత సెన్సిటివ్ గా ఫీలవుతావేంటి? గొప్ప సంబంధం తెచ్చావని నేను పొంగిపోతుంటే..." అన్నాడు.

సోమసుందరం చాలా సిగ్గుపడ్డాడు. కుదుటపడ్డ మనస్సుతో "రారా! మా వియ్యంకుడిని, అల్లుడిని చూపిస్తాను" అంటూ సోమసుందరం సావిట్లోకి తీసుకెళ్ళి పరిచయం చేశాడు మూర్తికి.

మూర్తి అల్లుడిని చూసివచ్చాక "అదృష్టమంటే నీదిరా. భలే మంచి ఛాన్సు కొట్టావులే! అమ్మాయికి ఏకంగా 'చక్రవర్తి'నే తీసుకొచ్చేశావు. భలే! భలే" అన్నాడు అనేకసార్లు మాటలమధ్యలో మురిసిపోతూ.

స్నేహధోరణిలోనే అన్నా సోమసుందరం మనస్సుకుమాత్రం ఈ మాటలు శూలాలై గుచ్చుకున్నాయ్. తను పేదవాడైనంతమాత్రాన కనికరించి తనకూతురు నెవరూ చేసుకోటంలేదా? అడిగినంతకట్నం యిచ్చినా పేదవాళ్ళు పనికిరారా? హీను అందమైనది కాకపోతే పిల్లమాత్రం ఒప్పుకునేవారా?

"అరె! మళ్ళా ఏమొచ్చింది? తప్పుమాట ఏమైనా అనివుంటే క్షమించు బ్రదర్" అంటూ గడ్డం పట్టుకున్నాడు మూర్తి. సోమసుందరం గంభీరవదనం చూసి భయపడి.

సోమసుందరం తన సంకుచిత స్వభావానికి సిగ్గుపడి మూర్తితో సరదాగా గడిపాడు.

సోమసుందరం వియ్యంకుడు పరంధామయ్య, అల్లుడు శేఖరం మర్నాడు గుంటూరుకు ప్రయాణం కట్టారు. మూర్తిని ఉండమని ఎంత బలవంతం చేసినా "ఎందుకురా. నీకెందుకు శ్రమ? వచ్చినపనేగా అయ్యింది. ఇందుమిందు ఒకచోటికి వెళ్ళాల్సినవాళ్ళమే గదా. ముగ్గురం కలిసే పోతాం. అయినా మళ్ళీత్వరలో హీము పెళ్ళికి యిక్కడికొచ్చేపని ఎల్లానూవుంది. అప్పుడు నువ్వు పొమ్మన్నదాకా కదలకుండా వుంటాను. ముహూర్తం పెట్టుకున్న వెంటనే నాకు వ్రాయటం మర్చిపోకేం?" అంటూ పరంధామయ్య, శేఖరంతో కలిసి మూర్తికూడా వెళ్ళిపోయాడు.

సోమసుందరం వాళ్ళను స్టేషనువరకూ సాగనంపి హీము పెళ్ళిగురించి ఆలోచించుకుంటూ యింటికి చేరుకున్నాడు.

* * *

రైలులో శేఖరం ఏదో పుస్తకం చదువుకుంటూ కూర్చుంటే మూర్తి, పరంధామయ్య పిచ్చాపాటిలో పడ్డారు.

"మా సోమసుందరం ఎంత అదృష్టవంతుడు కాకపోతే మీలాంటివారితో సంబంధం చేస్తాడు చెప్పండి? ఇన్నాళ్ళబట్టి బెజవాడలో వుంటున్నాను - ఎందుకు చెప్పండి! రెండామడల దూరంలో వున్న మీతో నాకు ఇంతవరకూ పరిచయమన్నా కలిగింది కాదు. ఏదో మా సోమసుందరంమూలంగా ఇప్పటికైనా మీ పరిచయభాగ్యం కలిగింది కాబట్టి సరిపోయింది కాని..." అని మూర్తి ఎంతో నొచ్చుకున్నాడు.

మూర్తి తనయందు చూపిస్తున్న గౌరవాదరాల్ని చూసి పరంధామయ్య సిగ్గుతో సంకుచితుడయ్యాడు.

"పరిచయానికేముంది లెండి! మేము గుంటూరుకొచ్చి ఎన్నాళ్ళో కాలేదు. అబ్బాయి చదువుకున్నన్నాళ్ళూ [illegible] లోనే వున్నాం. చదువుకాగానే అబ్బాయి గుంటూరులో ప్రాక్టీసు పెడతానన్నాడు. అందుచేత గుంటూరుకు మకాం ఎత్తేశాం. గుంటూరుకువచ్చి నాలుగైదు నెలలకంటె ఎక్కువకాలేదు. లేనిపోని పెద్దరికాన్నంటగట్టి గౌరవిస్తున్నారు గాని, యిందులో మీరంతగా నొచ్చుకోవాల్సిందేముంది?" అన్నాడు పరంధామయ్య నవ్వుతూ.

"బ్బా. బ్బా! ఎంతమాట!" అంటూ మూర్తి కొంత నొచ్చుకున్నాడు.

"అయితే—ఇంతకీ అబ్బాయి ప్లీడరీ చేస్తున్నారా? ఇప్పుడసలు 'లా' చదివిన వాళ్ళకున్న అవకాశాలు మరెవ్వరికీ లేవనుకోండి. మున్ముందు పని కొచ్చేదానికి ఓ అయిదేళ్ళు ప్రాక్టీసు చాలునట. చాలా మంచి కోర్సులెండి. చాలా మంచికోర్సు." మాటలమధ్యలో ఠక్కున ఆగి మూర్తి పరంధామయ్యకేసి చూశాడు.

"మీ అబ్బాయిని అల్లుడిగా చేసుకోవడానికి ఎంతమందో తొందరపడివుంటారు. అలాంటిది మా సోమసుందరానికి..." అని మూర్తి ఎంతో ఆశ్చర్యపడుతూ వాక్యం పూర్తి చెయ్యకుండా సగంలోనే ఆపేశాడు.

పరంధామయ్య మూర్తికేసి గర్వంగా చూస్తూ నవ్వాడు. "అవును! అబ్బాయి కోసం ఎంతమంది తిరిగారో లెక్కలేదు. కాని ఎక్కడ ప్రాప్తముంటే అక్కడే కాక తప్పుతుందా? అందరూ యిస్తానన్నంత కట్నం సోమసుందరంగారూ యిస్తానన్నారు. పోనీగదా అబ్బాయికి నచ్చిన పిల్లా. ఈ సంబంధం స్థిరపరిచాను" అన్నాడు పరంధామయ్య తన ఉదారబుద్ధి తెలియజేస్తూ.

పరంధామయ్య తన సానుభూతి నెలా తెలియజెయ్యాలో తెలీక తికమకపడుతూ తలవంచుకుని కూర్చున్నాడు.

"తెలివికైనా, చెప్పిన మాట వింటానికైనా అమ్మాయిల్ని చెప్పుకోవాలి గాని, ఏం [illegible] లెండి..." అని మూర్తి [illegible].

పరంధామయ్య [illegible] చూశాడు.

"మా అమ్మాయి కూడా యం. ఏ. ప్యాసయ్యింది లెండి. తెలివితేటలంటే దానివి. ఏం తెలివనుకున్నారు! [illegible] ప్యాసయ్యింది. [illegible], మొదట్న


లల్లూరాం అండ్ కంపెనీ
(స్థాపితము 1928.)
ఎన్నో సంవత్సరాలు గా మన్నికకు, నాణ్యతకు, సరసమైన ధరలకు ప్రసిద్ధి చెందిన
* ఇనుప పెట్టెలు * ఉక్కు బీరువాలు
* క్యాషు బాక్సులు
లల్లూరాం అండ్ కో,
విలగలేటివారి వీధి, : : విజయవాడ - 1.
క్రొత్త షోరూమ్ - మారుతి సినిమా ఎదురుగా.
LALLURAM

కుంపాయించుకుంది ఓ చిన్న బీరువా నిండా వున్నాయి మీ రెప్పుడన్నా మావూరు వస్తే ఎప్పుడో? ఏమిటి? మావూరి మీంచి వెళ్లుతూ మా యింటిలో దిగకుండా ఎలా వెళ్తారో చూస్తాగా!" అన్నాడు మూర్తి ఆప్యాయంగా నవ్వుతూ.

పరంధామయ్య సమాధానం చెప్పకుండా కాస్సేపటికి "అమ్మాయి నెవరికిచ్చారు?" నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ అడిగాడు

మూర్తి కాస్త తడబడ్డాడు "అహా! ఇంకా పెళ్లి కాలేదు లెండి ఏవేవో సంబంధాలు వస్తున్నాయి కాని ఏమిటో ఒక్క సంబంధమూ అమ్మాయికి గాని, నాకు గాని నచ్చకుండా వున్నాయి ఎం. ఏ. చదువుకున్న అమ్మాయిని చూస్తూ చూస్తూ ఏ గుమాస్తాకో, మేష్టరుకో ఎలా యివ్వను మంచి ఉద్యోగస్థుడి కిచ్చి చేయాలని అంటే ఏ డాక్టరుకో ప్లీడరుకో యివ్వాలని ప్రయత్నం చేస్తున్నాను. తగిన వరుడు దొరకాలే గాని, దేముడి దయవలన మాకు డబ్బుకేం లోటులేదు ఐదు వేలు కట్నం కావాలన్నా యివ్వగలను?"

"ఐదు వేలే!" అంటూ పరంధామయ్య నోరావలించి, ఆశ్చర్యంగా మూర్తివైపు చూశాడు

రైలు లేటు కావడంచేత బెజవాడ చేరుకునే సరికి చాలా ఆలస్యం అయ్యింది గుంటూరుకు వెళ్లే రైలు అంతకు ముందే ప్లాట్ ఫారమ్ వదలి అప్పుడే వెళ్ళిపోయింది ముగ్గురూ రైలుదిగి జనప్రవాహాన్ని తప్పించుకుని ఓమూలకు వెళ్ళి వించున్నారు

"వెధవ రైలు ఎంత లేటయ్యిందీ చూడండీ కనెక్షన్ ట్రైను కాస్తా తప్పిపోయింది మళ్లా అరగంటో గంటో ఈసురో మంటూ కూర్చుంటే కాని మోక్షంలేదు వెధవది. అదృష్టం కాకపోతే నిముషంలో తప్పిపోయింది" అంటూ పరంధామయ్య విసుక్కుని "పదరా అబ్బాయి. వెయిటింగు రూమ్‌కన్నా పోదాం పద ఇక్కడ యీ త్రొక్కిడిలో ఏమిటి? మూర్తిగారి దగ్గర సెలవు తీసుకుని పోదాం" అంటూ మూర్తి వేపు తిరిగాడు

"అదృష్టవశాత్తూ మీతో పరిచయం కలిగింది మీలో విశ్వాసంగో గాని నిముషంలో మమ్మల్ని మీ ఆత్మీయులుగా చేసుకున్నారు అబ్బాయి పెళ్ళికి తప్పకుండా వస్తారుకదూ! పాపం! చాలా రాత్రయింది మీరింకా యింటికి వెళ్ళాలి ఇంక సెలవు తీసుకుంటాం మరి" అన్నాడు పరంధామయ్య

మూర్తి "అహహా! అదేం వీల్లేదు మా యింటికి రాకుండా తప్పించుకుపోవాలని చూస్తున్నట్టున్నారు నా వియ్యంకుడొకటీ నాన్నే హితుడి వియ్యంకుడొకటే నా! నామీద దయయుంచి ఒక్కరోజైనా మీరు మాయింట్లో వుండి వెళ్ళాల్సిందని పదేపదే ప్రార్థిస్తున్నాను. ఈ రైలు తప్పిపోవడం చూస్తే దైవనిర్ణయం కూడా అలాగే వున్నట్టు తోస్తున్నది' అని ఆప్యాయంగా చేతులు పట్టుకుని బ్రతిమాలుతుంటే పరంధామయ్య కాదనలేక పోయాడు

పరంధామయ్యను, శేఖరాన్ని సంతోషంగా ఇంటికి తీసుకువెళ్లాడు మూర్తి

మూర్తిది చక్కటి రెండంతస్తుల మేడ ఇల్లంతా ఎంతో పరిశుభ్రంగా చూడ ముచ్చటగావుంది సామాన్లు ఎక్కడివక్కడ అందంగా పొందికగా అమర్చబడివున్నాయి కిటికీలకు తలుపులకు మంచి మంచి ఖరీదైన కర్టెన్లు వ్రేలాడుతున్నాయి

స్వంత యిల్లే కాకుండా మూర్తికి ఓ కారు కూడావుంది మూర్తి ఐశ్వర్యాన్ని కళ్ళారా చూసి పరంధామయ్య సంబరపడ్డాడు

పరంధామయ్య ఆలోచిస్తూ అటూ, ఇటూ పచారుచేస్తుండగా మూర్తి వచ్చి డ్రాయింగురూంలోకి తీసుకువెళ్ళాడు

వంటమనిషి ఫలహారాలు తెచ్చి బల్లమీద సర్ది లోపలకు వెళ్ళింది బల్లప్రక్క నే నించుని ఓ యువతి కాఫీ కలుపుతున్నది 'హిమ'అంత అందగత్తె కాకపోయినా అనాకారం కాదు పాములాంటి నల్లని పొడవైన జడ ఆమెకో అలంకారం

"మా అమ్మాయి శైలజ—'

శైలజ పరంధామయ్యని శేఖరాన్ని చిరునవ్వుతో పలకరించింది

"వంటమనిషి వున్నదన్న మాటే కాని దానికేం బద్ధకమో చెప్పలేం ఏదో ఒకటి ఎత్తరత్తరగా చేసేసి మాముఖాన పడెయ్యడమే కాని, అది మనం తినగలమో లేదో అని కూడా చూడదు శైలజ దాని వెనకాల వెనకాల తిరుగుతూ స్వయంగా అంతా చూడకపోతే మాపని అఖరయ్యేదే! చదువుకున్న వాళ్ళకి వంటచేయటం చేతకాదనుకుంటారు మనవాళ్ళు మా శైలజ చేతివంట ఒకసారి రుచిచూశారా మళ్ళీ జన్మలో అలాంటిమాట రానియ్యరు అయినా మా శైలజ తెలివి తేటలే వేరు-అసలు దానికి రాని విద్యంటూ ఏముంది కనక?" శైలజ ముఖం సిగ్గుతో ఎఱ్ఱబడింది తండ్రి ధోరణి మార్చాలని ఏదో చెప్పబోయింది

మూర్తి శైలజను నిర్లక్ష్యంచేసి "చూడండి నామాట అబద్ధమేమో! ఆ కర్టెన్లు, టేబిల్ క్లాత్‌లు అచ్చంగా రెడీమేడ్‌లా లేవు! వాటిమీద డిజైనులన్నీ అమ్మాయే స్వయంగా కుట్టింది."

"ఏమిటి నాన్నా నువ్వు" అని అస్పష్టంగా గొణిగింది శైలజ

మూర్తి "అనుకుంటే బొంగురుపున్నట్టు వుంటుందికాని. చదువులో దానికి పోటీ లేదు అమ్మాయి! నీకిచ్చిన ప్రయిజులన్నీ చూపించవే వీళ్లకి—" అని ఆగాడు

శైలజ సిగ్గుతో అప్పటికే సగం చచ్చింది ఖాళీయైన కాఫీ కప్పులు తీసుకుని మెల్లిగా గదిలోంచి నిష్క్రమించింది

మూర్తి తనే స్వయంగా వాటి నన్నిటిని తీసుకొచ్చి శేఖరానికి, పరంధామయ్యకు చూపిస్తూ అన్నాడు "చూడండి - ఇంత తెలివైన పిల్లను సామాన్యుడి కెలా యిస్తాం చెప్పండి? ఇంకా పెళ్ళిచెయ్యలేదని అందరూ నామీద నిందలు వేస్తారు కాని, ఆస్తి పోకపోయినా ఫర్వాలేదు అమ్మాయి అందచందాలకు, తెలివితేటలకు తగ్గట్టు ఏ ప్లీడరునో, గజెటెడ్ ఆఫీసరునో చేయాలని నా వూహ మీ ఎరుకలో అలాంటి సంబంధాలేమైనా వున్నాయా పరంధామయ్యగారూ?"

* * *

మధ్యాహ్నం భోజనాలయ్యాక పరంధామయ్య ప్రక్కమీద నడుం వాలుస్తూ శేఖరాన్ని పలుకరించాడు "ఏరా శేఖరం! శైలజను చేసుకోరాదటరా?"

శేఖరం తృళ్ళిపడి తలెత్తి పరంధామయ్యను చూశాడు

"ఏమిటి నాన్నా! నిన్ననేగా ప్రధానం చేసుకొచ్చాం ఇలా అంటావేమిటి?" అనడిగాడు శేఖరం విస్తుపోతూ

పరంధామయ్య పెదాలు చప్పరించి నిర్లక్ష్యంగా చూస్తూ "ప్రధానమైతే మాత్రం వచ్చిన నష్టమేముందిరా? మనకునచ్చకపోతే వదిలేసుకుంటాం" అన్నాడు

(43-వ పేజీ చూడండి)

సపట్ లోషన్ లేక మలాము
తామర, గజ్జి మరియు దురదలకు
ది ట్రేడ్ ప్రమోటింగ్ కార్పొరేషన్.
విజయవాడ - 2 RPC



లక్ష్మి ప్రొడక్షన్స
వారి "ఇలవేలుపు"
చిత్రంలో సరళగా
జమున.

ఆర్. కె ఫిలింస్‌వారి "జాగ్ తేరహో" లో ప్రదీప్ కుమార్, రాజ్ కపూర్.

పారమౌంట్ వారి విస్టావిజన్ చిత్రం "డెస్పరేట్ అవర్స్"లో హంఫ్రీ బొగార్ట్, ఫ్రెడరిక్ మార్చ్
ఈ చిత్రం దర్శకుడు విలియం వైలర్.





సాహిణీవారి "పెంకిపెళ్లాం" చిత్రంలో శ్రీరంజని.

# బొంబాయి సినిమా లేఖ

జపాన్‌లోని ప్రముఖ చిత్ర నిర్మాణ సంస్థ 'టోహో మోషన్ పిక్చర్స కంపెనీ'తో కలిసి జపాన్ హిందీ భాషలలో ఒక చిత్రం నిర్మించడానికి భారతీయ దర్శక నిర్మాత శ్రీ జయంత్ దేశాయ్ ప్రయత్నాలు చేస్తున్నారు. దీనిపై ఒప్పందం కుదుర్చుకోవడం నిమిత్తం ఆయన టోక్యో వెళ్ళి నెల్లాళ్లు ఉండి మొన్ననే వచ్చారు. ఈ చిత్రానికి కథను జపాన్‌లోనే వ్రాస్తున్నారని, అది పూర్తికాగానే, ఈ సంయుక్త నిర్మాణానికి భారత ప్రభుత్వం అనుమతి కోరగలమనీ ఆయన చెప్పారు. ఈ పనులన్నీ త్వరగా తెమిలిపోయినటయితే వచ్చే జనవరి నాటికల్లా చిత్ర నిర్మాణం ప్రారంభం కాగలదని ఆయన అన్నారు. జపాన్‌లో నివసిస్తున్న ఒక భారతీయ కుటుంబం. భారతదేశంలో నివసిస్తున్న ఒక జపనీస్ కుటుంబం ఈ కథకు ఆధారం అవుతాయనీ, ఈ రూపేణా, ఇరుదేశాల జీవన విధానాలను, సంస్కృతినీ చిత్రించడం సుసాధ్యం కాగలదనీ శ్రీదేశాయ్ చెప్పారు.

* * *

వెండితెరకు, కొత్త ప్లేబాక్ గాయకులను తీసుకు రావడానికి దేశవ్యాప్తంగా త్వరలోనే ఒక పోటీ జరుగబోతోంది. ఈ పోటీకి, ప్రముఖ సంగీత దర్శకులు నౌషాదాలీ, సి. రామచంద్ర, వసంత దేశాయ్, మదనమోహన, అనిల్ బిశ్వాస్‌లు పరీక్షకులుగా వ్యవహరించి, ఉత్తమ గాయకుని, గాయనినీ నిర్ణయిస్తారు.

ఈ తరహాలో గాయకుల కోసం పెద్ద ఎత్తున అన్వేషణ జరగడానికి ఇదే తొలిసారి. దీన్ని, బొంబాయిలోని మెట్రో సినిమా అధిపతులు, మర్ఫీ రేడియో కంపెనీ వారు కలిసి నిర్వహిస్తున్నారు. బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, మద్రాసు, జైపూర్, కాశీ, లక్నో నగరాలను పోటీలకు కేంద్రాలుగా నిర్ణయించారు. పరీక్షక బృందం ఒక్కొక్క కేంద్రం నుంచి ఒక్కొక్క యువతిని, ఒక్కొక్క యువకుడినీ ఏరుతారు. ఆ పైన వారందరినీ బొంబాయి తీసుకువెళ్ళి తుది పరీక్షలు జరుపుతారు.

అక్కడ ఉత్తీర్ణులు అయ్యే యువతీ యువకులు ఇదివరకే పరీక్షాధికారులు అయిన సంగీతదర్శకులు ఏరుకుంటూ, తాము సంగీతం కూర్చే చిత్రాలలో ఒక్కొక్క పాటకు అవకాశం ఇస్తారు. ఈ ప్రకారం ఐదు చిత్రాలలో పాడినందుకు, యువతికి పాటకు రు 500 చొప్పున, రు 2500, యువకుడికి పాటకు రు 400 చొప్పున రు. 2000 ఇస్తారు. ఈ డబ్బు మాట ఎలా ఉన్నా ఇద్దరు కొత్త వారికి చలన చిత్రసీమలో ప్రవేశం లభిస్తుంది. గొంతు కొత్త కంఠాలను వినే అవకాశం అందరికీ లభిస్తుంది.

ఈ పోటీలు ఎప్పుడు ప్రారంభించేదీ త్వరలో నే ప్రకటిస్తారు.

*   *   *

సినీ టెక్నీషియన్లకోవకు చెందే వారంతా కలసి, పశ్చిమ ఇండియా సినీ ఎంప్లాయీస్ ఫెడరేషన్ పేరిట, ఒక సంఘంగా ఏర్పడ్డారు. ఆయా సంఘాలు, వ్యక్తిగత సమస్యలను పరిష్కరించడానికి కృషి చేస్తున్నవనీ, ఇపుడు టెక్నీషియన్లు సమష్టిగా ఎదుర్కొనే కష్టనష్టాలను నివారించడానికి ఈ సమాఖ్య పనిచేస్తుందనీ, అధ్యక్షుడు శ్రీ కృష్ణగోపాల్ తెలియచేశారు. ఉద్యోగాల భద్రత, వేతనాల వ్యవహారాలు, కట్టుదిట్టం చేయడానికి ఈ సంఘం కృషి చేస్తుంది. వెస్టర్న్ ఇండియా సినిమాటోగ్రాఫర్స్ సంఘం, ఇండియన్ మోషన్ పిక్చర్ ఎంప్లాయీస్ యూనియన్, అసిస్టెంట్ డైరెక్టర్ల సంఘం, కాస్ట్యూమ్, మేకప్ ఆర్టిస్టుల సంఘం, నృత్యదర్శకుల సంఘం, ఫిలిం ఎడిటర్ల సంఘం యీ సమాఖ్యలో చేరాయి. త్వరలో నే మరికొన్ని చేరబోతున్నాయి

*   *   *

నటి విజయలక్ష్మికి తొలిసారిగా ఒక బెంగాలీ చిత్రంలో నాయికపాత్ర లభించింది. చిరకాలంగా ఉన్న అభిలాష ఇప్పుడు నెరవేరుతుందని ఆమె సంతోషం వెలిబుచ్చింది "నిజానికి నా మాతృభాష బెంగాలియే. నేను ధారాళంగా ఆ భాష మాట్లాడగలను" అంది విజయలక్ష్మి ఆమె తల్లి బెంగాలీ; తండ్రి పంజాబీ ఈమె నటించబోతున్న బెంగాలీ చిత్రం 'అంతిపాల్'.

*   *   *

బిమల్ రాయ్ ప్రొడక్షన్స్ వారి హాస్య చిత్రం "పరివార్" మొన్న నే మోహన్ స్టుడియోలో సెట్స్‌కు వెళ్లింది ఉషాకిరణ్ దుర్గాఖోట్, ఆగా, జైరాజ్, సజ్జన్, బిపిన్ గుప్త, అన్వర్ హుసేన్, అసీంకుమార్, కమల్ కపూర్ బెంగాలీ తార సబితా చటర్జీ ఇందులో పాల్గొంటున్నారు. పది సంవత్సరాలుగా బిమల రాయ్ దగ్గర పనిచేస్తున్న ఆసిత్ సెన్ దీనికి దర్శకుడు సంభాషణలు పాల్ మహేంద్రా సంగీతం సలీల్ చౌదరి

*   *   *

ఫిల్మిండియా కార్పొరేషన్ వారి "సోనే కి చిడియా' అనే చిత్రానికి కూడా మొన్న నే సెట్స్ మీద పని ప్రారంభం అయింది నూతన్, బల్‌రాజ్ సాహ్ని నటిస్తున్న ఈ చిత్రానికి షహీద్ లతీఫ్ దర్శకుడు: ఆయన నిర్మాత కూడా సంగీతం ఓ పి నయ్యర్.

(ఆంధ్ర వారపత్రిక బొంబాయి విలేఖరి)





"భాయ్ భాయ్"లో నిమ్మి, నిరూపరాయ్.

## సినిమా వార్తలు

జూపిటర్ వారి "ఉమాసుందరి" కూడా ఈ నెలలో నే విడుదలకావచ్చు శ్రీరంజని, రామారావు, రేలంగి మొదలగువారు నటించిన ఈ చిత్రానికి శ్రీ లంక సత్యం దర్శకుడు శ్రీ పి పుల్లయ్య పర్యవేక్షణ చేస్తున్నారు

*   *   *

వీనస్ పిక్చర్స్ వారి తమిళచిత్రం "అమరదీపం"ను సమతా పిక్చర్స్ అనే కొత్తసంస్థ తెలుగులో "అమరజీవి" అనే పేరుతో విడుదల చేయబోతున్నారు సావిత్రి, పద్మిని, ఇ వి సరోజ, నాగయ్య, శివాజి గణేశన్ మొదలగువారు నటీనటులు దర్శకుడు శ్రీ తాతినేని సంగీతం శ్రీ చలపతిరావు, మాటలు పాటలు శ్రీశ్రీ చిత్రనిర్మాత శ్రీ పి వి వి సత్యనారాయణమూర్తి

*   *   *

లక్ష్మి ప్రొడక్షన్స్‌వారి "ఇలవేలుపు" చిత్రం ఈ నెల21 న విడుదల అవుతుంది. శ్రీ యోగానంద్ దర్శకత్వాన తయారైన ఈ చిత్రంలో అంజలి, కృష్ణకుమారి, నాగేశ్వరరావు, రేలంగి, రమణారెడ్డి నటించారు.

*   *   *

ఆర్ ఆర్. పిక్చర్స్‌వారి తెలుగుచిత్రం "కార్తవరాయుని కథ" చురుకుగా తయారవుతోంది. నాగేశ్వరరావు, బి ఎస్. సరోజ, గిరిజ, రమణారెడ్డి, రాజనాల, పద్మనాభం, బాలకృష్ణ, నటిస్తున్నారు. ఈ చిత్రానికి శ్రీ ముద్దపట్ల సూరి, మాటలు, శ్రీ దేవులపల్లి వెంకటకృష్ణశాస్త్రి పాటలు వ్రాశారు.

*   *   *

### "కాబూలీ వాలా"

ప్రపంచ ప్రసిద్ధినందిన టాగూర్ కథ "కాబూలీ వాలా"ను బెంగాలీ దర్శకుడు తపన్ సిన్హా వెండితెరమీద చిత్రిస్తున్నారు. ఇందులో, కాబూలీవాలా భూమికను ఛబ్బిబిశ్వాస్ నిర్వహిస్తున్నారు "మినీ" భూమికను టింకూ టాగూర్‌కు ఇచ్చారు మినీ తల్లితండ్రులుగా మంజుడే, రాధా మోహన భట్టాచార్య నటిస్తున్నారు.

సుప్రసిద్ధ సంగీత విద్వాంసుడు, రవిశంకర్ (ఉదయ శంకర్ సోదరుడు) ఈ చిత్రానికి సంగీతం సమకూర్చుతున్నారు.



రమేశ్ సైగల్ చిత్రం "26, జనవరి"లో నళినీజయవంత్

# ★ సినిమా వార్తలు ★

"పథేర్ పాంచాలీ" చిత్రానికి కూడా ఈయనే సంగీత దర్శకుడు

* * *

ఆంధ్రలో శతదినోత్సవాలు చేసుకున్న సాధనా వారి "సంతానం" చిత్రాన్ని అసోసియేటెడ్ ప్రొడ్యూసర్స్ అనే సంస్థ తమిళంలోకి డబ్ చేసి విడుదల చేశారు. సావిత్రి, నాగేశ్వరరావు, రేలంగి, రంగారావు ప్రభృతులు నటించిన ఈ చిత్రం శ్రీ రంగనాథదాస్ దర్శకత్వాన శ్రీ ప్రసాద్ పర్యవేక్షణ క్రింద తయారైంది శ్రీ దక్షిణామూర్తి సంగీతం కూర్చారు

తమిళ చిత్రానికి మాటలు తంజై గోవిందన్, పాటలు కుయిలన్ వ్రాశారు

* * *

శ్రీ దోనేపూడి కృష్ణమూర్తి "ఇంటి దొంగ" అనే సాంఘిక చిత్రం నిర్మిస్తున్నారు జగ్గయ్య, జానకి, ముఖ్యపాత్రలు నిర్వహిస్తున్నారు దర్శకుడు బృధ్వీన్ రజనీకాంత్

* * *

మద్రాసు సినిమాల చట్టంలో 6 వ సెక్షన్ క్రింద, చలన చిత్రాల ప్రదర్శనాలకు అనుమతులివ్వడంలో ప్రభుత్వానికి సలహా ఇచ్చే నిమిత్తం మద్రాసు ప్రభుత్వం, రాష్ట్ర పోలీసు కమీషనర్ అధ్యక్షతన ఒక సంఘం నెలకొల్పారు. ఈ సలహాసంఘంలో శ్రీమతి మోనా హెన్సమన్ శ్రీ కె చంద్రశేఖరన్, శ్రీ ఎం పి పెరియస్వామి అనధికార సభ్యులు వీరి సభ్యత్వం ఏడాది ఉంటుంది రాష్ట్రవిద్యాశాఖాధికారి ఉద్యోగరీత్యా సభ్యుడుగా ఉంటాడు

## రాజ్యం పిక్చర్స్ వారి 'హరిశ్చంద్ర'

వెలుగులికి వచ్చిన కథలను నాటకాలను తెరకెక్కించినపుడు అందరికీ అలవాటైన పంథాలోనే, రైలు పట్టాలు తప్పకుండా మాసలగోడలు దాటకుండా చిత్రాన్ని నిర్మిస్తే వాటికి ఢోకా ఉండదు ఉండదనే 'మాయాభారం' వంటి చిత్రాలవల తేలింది. రాజ్యం పిక్చర్స్ వారి 'హరిశ్చంద్ర' చిత్రం కూడా దాదాపు ఈ దారినే తయారైంది అందువల్ల దీనికి జనాదరణ లభించక పోయే ప్రమాదం ఉండదు ఈ రకం పౌరాణిక గాథలు ఆధారంగా తయారయే చిత్రాలు చూస్తూ ఉంటే, పోతపోసిన ఆదర్శపురుషుల, స్త్రీల మాటలూ, నాటకాల ద్వారా ప్రసిద్ధి కెక్కిన పద్యాలూ వింటూ ఉంటే, నాటకం చూస్తున్న భావం కలుగుతుంది అక్కడక్కడ పాటలలో, ఎరువు తెచ్చిన వరసలు వినబడ్డప్పుడూ, హిందీ సినిమాలను గుర్తుకు తెచ్చే నృత్యాలు కనబడ్డప్పుడూ మాత్రం అది సినిమా అయిన వైనం స్పష్టం అవుతూ ఉంటుంది

ఇపుడు శ్రీమతి లక్ష్మీరాజ్యం నిర్మించిన "హరిశ్చంద్ర" చిత్రానికి కథతోడు నటీనటుల కృషి కూడా కొంత బలం చేకూర్చింది స్వర్గీయ బలిజేపల్లి లక్ష్మీకాంత కవిగారి పద్యాలు పాతికపైగా ఉన్నాయి వాటిలో హరిశ్చంద్రుని పద్యాలను ఘంటసాల రసవంతంగా పాడారు

హరిశ్చంద్రుడుగా ఎస్ వి. రంగారావు, చంద్రమతిగా లక్ష్మీరాజ్యం, విశ్వామిత్రుడుగా గుమ్మడి, నక్షత్రకుడుగా రేలంగి, వీరబాహుగా ఎ వి సుబ్బారావు కలహకంఠిగా సూర్యకాంతం నటించారు సూరిబాబు రఘురామయ్య, గౌరీపతిశాస్త్రి మాస్టర్ గిరి సీత, రాజసులోచన మొదలగు వారు కూడా పాల్గొన్నారు శ్రీ జంపన దర్శకత్వం నిర్వహించారు మాటలూ కొన్ని పాటలూ కూడా ఆయనే వ్రాశారు శ్రీ కొసరాజు కొన్ని పాటలు వ్రాశారు. శ్రీ దక్షిణామూర్తి సంగీతం కూర్చారు.

ఘంటసాల, మాధవపెద్ది, ఎం. ఎస్. రామారావు, నాగేశ్వరరావు, దక్షిణామూర్తి ఎ లీల జిక్కి, సుశీల, స్వర్ణలత, సత్యవతి ప్లేబాక్ పాడారు

రాజసులోచన, కుచలకుమారి సరోజ, రీటా నృత్యాలు చేశారు నృత్యదర్శకుడు శ్రీ వెంపటి సత్యం

ఆంధ్రలో వందలసార్లు ప్రదర్శించబడ్డ 'హరిశ్చంద్ర' నాటకంలో బహుళ జనాదరణ పొందిన నటీనటులలో శ్రీ వి. సుబ్బారావు బందారు వెంకటేశ్వరరావు గారల జంట హరిప్రసాద్ రావు ముప్పిడి జగ్గరాజు గారలజంట అగ్రగణ్యములైనవి ఇ రాజమండ్రి వాస్తవ్యులు బ్రహ్మజోస్యుల సుబ్బారావుగారు హరిశ్చంద్ర పాత్రధారిగా మంచిపేరు గడించుకొన్నారు విశ్వామిత్రుడి పాత్రకు శ్రీపతి పట్టాభిరామారావుగారు ఒకప్పుడు మంచి పేరు గడించారు. హరిశ్చంద్ర నాటకకర్త స్వర్గీయ బలిజేపల్లి లక్ష్మీకాంతంగారు కూడా తమ నాటకంలో హరిశ్చంద్రుడి పాత్ర కొన్ని సందర్భాలలో నక్షత్రకుడి పాత్ర కూడా నిర్వహించారు

పార్ కంబైన్స్ వారు 20 ఏళ్ల క్రితం హరిశ్చంద్రుడి కథను తెరకెక్కించారు. అందులో అద్దంకి శ్రీరామమూర్తి కన్నాంబ ముఖ్యభూమికలను నిర్వహించారు.



హిందీ చిత్రం "మిస్టర్ చక్రం"లో తమిళ నటుడు రంజన్

★

## టీ సెంటర్‌లో సినిమా

దేశంలో తొలిసారిగా టీ బోర్డు వారు బొంబాయిలో ఆధునిక పద్ధతుల పై నెలకొల్పిన 'టీ సెంటర్' లో ఒక చిన్న చలన చిత్ర ప్రదర్శనశాల ఏర్పాటు చేశారు టీ త్రాగడానికి వచ్చేవారికి ఇక్కడ చిన్న చిన్న చిత్రాలు ఉచితంగా చూపిస్తూ ఉంటారు

టీ ప్రచారానికి సంబంధించిన చిత్రాలే కాక దేశాభివృద్ధి కార్యక్రమాలను చిత్రించే డాక్యుమెంటరీల వంటివి కూడా ప్రదర్శిస్తారు ఈ హాలు లో సలభై మందికూర్చోడానికి వసతి వుంది. ఈ 'టీ సెంటర్'ను కేంద్ర వాణిజ్య పరిశ్రమల మంత్రి శ్రీ టి టి కృష్ణమాచారి మొన్న ప్రారంభోత్సవం చేశారు ఇది బాగా నడిస్తే మద్రాసు, కలకత్తా ప్రఖ్యాత నగరాలలో కూడా ఇట్టివి నెలకొల్పుతారు

## శ్రీ వాసన్ కుమారునికి వివాహం

జెమినీస్టుడియో అధిపతి శ్రీ ఎస్ ఎస్ వాసన్, తమ కుమారుడు చి॥ బాలసుబ్రహ్మణ్యన్‌కు సౌభాగ్యవతి సరోజ (శ్రీ కె గోపాలకృష్ణ అయ్యర్ కుమార్తె) ఈ నెల 4 వ తేదీన 115 మౌబ్రీస్ రోడ్‌లో వైభవంగా వివాహం చేశారు సినిమా పరిశ్రమకు చెందిన పలువురువచ్చి వధూవరులను ఆశీర్వదించారు

* * *

మూలం: ఎడ్గార్ వాలెస్

# అరుణ వలయం

అనువాదం: "ప్రద్యుమ్న"

## 17. సబ్బు బుడగలు.

అర్ధరాత్రి దాటి చాలసేపైంది. డెరిక్ యేల్ తనగదిలో కూర్చునిఉన్నాడు. ఎవరో తలుపు తట్టారు యేల్ తలుపు తీశాడు. ఇన్స్పెక్టర్ పార్ లోనికి ప్రవేశించాడు.

ఆ రాత్రి జరిగిన హత్య వృత్తాంతం పార్ తెలియజేశాడు.

"నా కెందుకు చెప్పలేదు" అని డెరిక్ యేల్ కొంచెం కోపగించుకున్నట్లు ముఖం పెట్టి అడిగాడు. తరవాత నవ్వేశాడు. "పోనీలే, అనవసరంగా నీ వ్యవహారాల్లో నేను జోక్యం చేసుకోవడం ఎందుకు? కాని హంతకుడెలా తప్పించుకుపోయాడో తెలియడంలేదు. రెండు గంటలసేపు మార్ల్ ఇంటికి పోలీసుకాపలా పెట్టావన్నావు గదా! పోనీ ఆ యువతి అయినా బయటికి వచ్చిందా?"

"ఆఁ, వచ్చింది. సరాసరి కారెక్కి ఇంటికి వెళ్లిపోయింది"

"తరవాత ఎవరూ లోపలికి వెళ్లలేదా?"

"అది నమ్మకంగా చెప్పలేను. ఇంట్లో ఎవడు ఉన్నాడో తెలియదు గానీ, వాడు మార్ల్ నాటకశాలనుంచి తిరిగి రాకముందే ఇంట్లో ప్రవేశించిఉండాలి. ఇంటి వెనక భాగంలో ఉన్న కారు షెడ్డులోంచి బయటికి పోయేదారి ఉంది. మొదట్లో నేను దాన్ని చూడనేలేదు. తరవాత చూశాను. ఇంటికిచుట్టూ కాపలా పెట్టానని అన్నాను గాని నిజంగా అంత గట్టికాపలా పెట్టలేను. వెనకవైపు తోటలోనుంచి దారి ఉంది. అసలక్కడ తోట ఉన్నట్లే నేను అనుమానించలేదు. హంతకుడు కారు షెడ్డులోనుంచి ఆ దారినే వెళ్లిఉంటాడు," అని పార్ వివరించాడు.

"థాలియా డ్రమండ్ మీద నీ కనుమానం ఉందా?" యేల్ ప్రశ్నించాడు.

పార్ లేదన్నట్లు తల అడ్డంగా తిప్పాడు.

"అయితే మార్ల్ ఇంటికి పోలీసుకాపలా ఎందుకు పెట్టాల్సివచ్చింది?" యేల్ తీవ్రంగా అడిగాడు.

"ఎందుకంటే మార్ల్ లండన్ వచ్చినప్పటి నుంచీ అతనిపై పోలీసు నిగాఉంది. బియర్డ్ మోర్ కు వ్రాసిన ఉత్తరంలోని భాగాన్ని మార్ల్ దస్తూరిని పోల్చిచూశాను. అతని దర్జీవాడి చిరునామా వ్రాసి ఇమ్మని ఒకసారి అడిగి తీసుకున్నాను ఆ ఉత్తరం వ్రాసింది అతడేనని తెలిసినప్పటినుంచీ అతనిపై నిగా పెట్టాను."

"మార్ల్ పైనా?"

పార్ అవునన్నాడు.

"మార్ల్ కీ, చనిపోయిన బియర్డ్ మోర్ కు మధ్య ఏం జరిగిందో నాకు దురూహ్యంగా ఉంది. అప్పుడు జరిగిన దాన్ని ఊహించడానికి చాలా ప్రయత్నంచేశాను. మార్ల్ బియర్డ్ మోర్ గృహానికి వెళ్లినప్పుడు ఎందుకో హఠాత్తుగా భయపడ్డాడు జ్ఞాపకం ఉందా?" పార్ అడిగాడు.

"జ్ఞాపకం ఉంది జాక్ బియర్డ్ మోర్ చెప్పాడు."

"అక్కడ ఉండడానికి వీల్లేదనీ, తాను లండన్ వెళ్లిపోతాననీ మార్ల్ బియర్డ్ మోర్ తో చెప్పాడు. నిజానికతడు లండన్ వెళ్లలేదు. తొమ్మిదిమైళ్ల దూరంలోవున్న కింగ్ సైడ్ స్టేషనులో దిగి రోడ్డు వెంబడే వెనక్కి వచ్చాడు. బియర్డ్ మోర్ ను చంపిన హంతకుడు సిబీ ఆ రాత్రి అడవిలో దాగి ఉన్నప్పుడు కనబడిన వ్యక్తి మార్ల్ అయి ఉంటాడు. అంత భయపడి, తిరిగి వెళ్లిపోయినవాడు మళ్లీ దొంగచాటుగా ఎందుకు వచ్చాడు? బియర్డ్ మోర్ తో ముఖాముఖి మాట్లాడే అవకాశం ఉండగా ఆ ఉత్తరం ఎందుకు వ్రాశాడు?"

చాలాసేపు ఇరువురూ మౌనంగా ఉన్నారు.

"మార్ల్ ఎలా చచ్చిపోయాడు?" యేల్ అడిగాడు.

"అదే తెలియడం లేదు," అని పార్ వివరించడం మొదలెట్టాడు. "మార్ల్ గదిలోకి హంతకుడు ప్రవేశించలేదనుకుంటాను. ఫ్లష్ బార్నెట్ తో నేను మాటాడాను. వాడికి మార్ల్ హతుడైనట్లు తెలియనే తెలియదు. వాడు కేవలం దొంగతనం కోసమే మార్ల్ ఇంట్లో దూరాడట. ఇంట్లో ఎవరో తిరుగుతున్న అలికిడి అయినట్లు, అతను వెంటనే దాగుకున్నట్లు చెబుతున్నాడు. పైపులోంచి గాలి వస్తున్నట్లు బుస్సుమనే ధ్వని వాడికి వినవచ్చిందట అదీగాక మార్ల్ చేతికి సమీపాన తలగడమీద ఒక గుండ్రని తడి గుర్తు కనిపించింది సరిగ్గా వలయాకారంగా ఉంది అది అరుణవలయ చిహ్నమేమోనని నేను అనుమానించాను. కాని మరో చోటకూడా అలాంటిదే కనిపించింది. డాక్టరు కూడా హతుడు ఎలా మృతుడైనాడో చెప్పలేకపోయాడు. నిన్న నిందాక నే బ్రబజాన్ తో టెలిఫోనులో మాట్లాడాను. నిన్న మార్ల్ బ్రబజాన్ బ్యాంకినుంచి చాలా ధనం తీసుకున్నాడట. అసలు బ్రబజాన్ మార్ల్ తో ఏదో దెబ్బలాటవచ్చి అతని ఖాతా తొలగించివేశాడట. ఇనపపెట్టెను ఫ్లష్ బార్నెట్ తెరిచి చూశాడు కాని వాడికి అందులో డబ్బేమీ దొరకలేదు. మేము వాణ్ణి సోదా చేశాము. ఆడబ్బెవరు తీసి ఉంటారో మరి?"

డెరిక్ యేల్ ఏదో ఆలోచిస్తూ గదిలో అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు.

"బ్రబజాన్ను గూర్చి నీకేమన్నా తెలుసా?" యేల్ అడిగాడు.

పార్ కొంత సేపటి దాకా సమాధానం ఇవ్వలేదు.

"అతడు బ్యాంకర్ అనీ, విదేశాలలో కూడా వ్యాపార సంబంధాలున్నాయనీ మాత్రం తెలుసు"

"బ్రబజాన్ బ్యాంకర్ గా నమ్మదగినవాడేనా?" డెరిక్ యేల్ కటువుగా అడిగాడు ఇన్స్పెక్టర్ పార్ నెమ్మదిగా తల ఎత్తి యేల్ వంక చూశాడు

"ఊహూ. పైగా అతడు అవలంబించే పద్ధతులను గూర్చి మాకు కొన్ని ఫిర్యాదు లీమధ్య వరలో వచ్చాయి."

"మార్ల్ కు బ్రబజాన్ కు బాగా స్నేహమా?"

"అనుకుంటాను నాకు తెలిసిన దాన్నిబట్టి మార్ల్ కు బ్రబజాన్ను తన చెప్పుచేతల్లో ఉంచుకోగల రహస్యమేదో తెలుసునట.

"బ్రబజాన్ దగ్గర డబ్బులేదు. మార్ల్ తన ఖాతా ఇవాళమధ్యాహ్నమే మూసివేశాడు.

ఎందుచేత మానేశాడో! అసలతడు ఇవ్వాళ బ్యాంకికి వెళ్లాడా?"

ఇన్‌స్పెక్టర్ పార్ బ్యాంకిలో జరిగినదంతా చెప్పాడు. అయితే అతడు చెప్పిన సమాచారం యేల్‌కు కొత్తేమీ కాదు. ఐనా ఆ సమాచారమంతా కూపీ లాగగల పార్ చాకచక్యాన్ని యేల్ అభినందించకుండా ఉండలేక పోయాడు. ఇంతవరకూ పార్ కుంత అని అతని అభిప్రాయం.

"ఈ రాత్రి మనం మార్ల్ యింటికి వెళ్ళటానికి వీలుంటుందా?"

"నిన్ను తీసుకు వెళ్ళడానికే నేనసలు ఇక్కడికి వచ్చాను బయట మనకోసము టాక్సీ కూడా అట్టే పెట్టాను" అన్నాడు పార్.

దోవలో డెరిక్ యేల్ ఏదో ఆలోచనలో మునిగి నోరు విప్పనైనా విప్పలేదు. మార్ల్ యింటికి వెళ్లి హాలులో నిలబడ్డాక గాని అతడు మాట్లాడలేదు.

"ఇక్కడెక్కడో ఒక ఉక్కు సిలిండరు ఉండాలి," యేల్ నెమ్మదిగా, సాలోచనగా అన్నాడు.

హాలులో కాపలా ఉన్న పోలీసు ఒకడు పార్ వద్దకు వచ్చి శాల్యూట్ చేసి "కారు షెడ్డులో ఒక ఇనపసీసా దొరికిందండి" అన్నాడు.

"ఆ, నేను చెప్పలా" అని యేల్ విజయగర్వంతో అన్నాడు. గబగబ మెట్లెక్కి మేడమీద నడవలో ఆగాడు అక్కడ బాగా లైట్లు వెలుగుతున్నాయి. పై కిటికీ వద్ద గోడకి దగ్గరగా బల్ల ఉన్నది దానిని అతడు సమీపించాడు. నెమ్మదిగా నేలకి ంగాడు. తివాచీని వాసన చూశాడు. వెం నే ఉక్కిరిబిక్కిరై దగ్గుతూ లేచి నుంచు న్నాడు. అతని ముఖం ఎర్రబడి పోయింది.

"ఆ సిలిండరు చూడనియ్" అన్నాడు. పోలీసులు తీసుకువచ్చి ఇచ్చారు. అది సిలిండరు కాదు, సీసావలెనే ఉన్నది. ఆ ఇనప సా మూతవద్ద, ఒక చిన్న పైపు ఉన్నది. దానిని తిప్పే మరకూడా ఉన్నది

"ఇక్కడెక్కడో ఒక పాత్రకూడా ఉండాలి. లేక హంతకుడు సీసా తీసుకొచ్చి ఉండవచ్చు," అని యేల్ చుట్టూ చూశాడు.

"కారు షెడ్‌లో ఈ ఇనపసీసా ప్రక్కనే గాజుసీసా కనిపించిందండి. కాని అది పగిలిపోయి ఉంది," అన్నాడొక పోలీసు.

"త్వరగా తీసుకురా దాన్ని. అది పూర్తిగా పగిలిపోకుండా ఉంటే బాగుండును" అన్నాడు యేల్.

పార్ అతనికేసి సాలోచనగా చూస్తూ నిలబడ్డాడు.

"ఇదంతా ఏమిటి?" పార్ అడిగాడు.




# మీరు సౌందర్యమును పొందండి

చర్మమును మృదువుగా చేయు క్రీమ్
మీ ముఖమును మనోహరముగ ఉంచును

అద్భుతమైన పాండ్స్ కోల్డ్ క్రీమ్ క్రమముగా వాడితే మీ చర్మము లేతగా మరియు అందముగ ఉండును.
ప్రతి రాత్రి మీ ముఖమునకు పాండ్స్ కోల్డ్ క్రీమ్ రుద్ది రాసుకోండి. అది చర్మము లోపలికి చొచ్చుకుని దుమ్మును తీసివేసి, మీ చర్మమును మృదువుగా, మనోహరముగా ఉంచును. చర్మమును మృదువుగాచేయు ఈ క్రీమ్ మీ ముఖమును నవవికసిత పుష్పమువలె నిర్మలముగా, అందముతకూడ ఉంచును!

పాండ్స్ కోల్డ్ క్రీమ్




చర్మ రక్షణ నూనెను తిరిగి యివ్వండి
మీరు ముఖము కడుగుతున్న ప్రతిసారి చర్మ రక్షణనిచ్చే నూనెను పోగొట్టుకొంటున్నారు. ఆవశ్యకమగు నూనెను కూర్చే పాండ్స్ కోల్డ్ క్రీమ్ వాడి సహజముగ చర్మ రక్షణనిచ్చే నూనెను సత్వరముగ తిరిగి యివ్వండి. అది మీ చర్మమునకు తిరిగి రక్షణనిచ్చి మీ ముఖమును చాల లేతగా మరియు సుందరముగ ఉంచును!

P 7303

యేల్ ఇకిలించాడు.

"హత్య చెయ్యడానికి ఇదో కొత్తపద్ధతి, పద గదిలోకి పోదాం" అన్నాడు యేల్.

గదిలో మార్ల్ శవం మంచంమీదనే ఉన్నది. దానిమీద ఒక దుప్పటి కప్పారు. తలగడమీద తడిగుర్తు ఇంకా ఆరిపోలేదు. కిటికీలన్నీ తెరిచి ఉన్నాయి. గాలికి తెరలన్నీ రెప రెపలాడుతున్నాయి

"ఇక్కడికి అట్టే వాసన కొట్టడంలేదు" అంటూ యేల్ మళ్ళీ నేలకి వంగాడు తివాచీని వాసనచూసి, మళ్లీ దగ్గుతూ లేచాడు.

ఈలోగా పోలీసులు గాజుసీసా అడుగు భాగం తీసుకొచ్చారు. ఇంకా దానిలో కొద్దిగా ద్రావకం మిగిలి ఉంది. దాన్ని చేతులో పోసుకున్నాడు యేల్.

"సబ్బునీళ్లు. నేను అదే అనుకున్నాను. మార్ల్ ఎలా చనిపోయాడో చెబుతాను విను ఫ్లష్‌బార్నెట్‌కు బుస్సు మనే ధ్వని వినిపించిందే! అది ఈ సిలిండరులోంచి బరువైన వాయువు వెలుపలికి వస్తున్న ధ్వని అయివుండాలి నా ఊహా తప్పుకావచ్చు. కాని ఈ ఇనపసీసాలో నిన్నూ నన్నూ హతం చెయ్యడానికి తగినంత విషవాయువు ఉంది ఈ వాయువు ఇంకా నేలని అంటి పెట్టుకుని ఉంది. బరువైన వాయువులు నేలకి దిగుతాయని నీకు తెలుసుగా."

"అయితే ఆ వాయువు మార్ల్‌ను ఎలా చంపగలిగిందీ అని నా ప్రశ్న. కిటికీ చువ్వల్లోంచి వాయువును అతనితలమీదికి పంప్ చేశారా?" పార్ ప్రశ్నించాడు.

డెరిక్ యేల్ కాదన్నట్లు తల ఆడించాడు.

"అరుణ వలయంవారు అంతకంటె తేలిక పద్ధతి, ప్రమాదకరమైన పద్ధతి అవలంబించారు. వారు బుడగలు ఊదారు"

"బుడగలా?"

"అవును. ఈ సిలిండరు మూతిని సబ్బు నీళ్ళలో ముంచారు. తరవాత దాన్ని కిటికీ చువ్వలలోంచి లోపలకి ప్రవేశపెట్టారు. పైపుమర తిప్పారు. మూతివద్ద ఒక బుడగ ఏర్పడింది. అది విడిపోయి ప్రయాణం చేసింది. పడకలో బల్లమీదెక్కి నుంచుంటే హంతకునికి మార్ల్ కనిపిస్తాడు గదా. కొన్ని బుడగలు అటూ ఇటూ చెదిరిపోయి ఉంటాయి. ఒకటి తలగడమీద పడింది. కాని అది మార్ల్ చనిపోయిన తరవాత అక్కడ పడి ఉంటుంది. మరొకటి గోడమీద పడివుంటుంది. అదిగో ఇంకా దాని ముద్ర అలాగే ఉండిపోయింది. ఒకటో రెండో బుడగలు మార్ల్ ముఖంమీద పగిలిఉంటాయి. వెంటనే అతడు చనిపోయి ఉంటాడు"

పార్ ఇదంతా నోరు తెరుచుకుని వింటూ ఉండి పోయాడు.

యేల్ ఇంకా ఇలా అన్నాడు. "నే నిదంతా కారులో వస్తూనే ఊహించాను. తలగడమీద వలయాకారపు తడిముద్ర, గోడపైభాగాన కిటికీ, బుస్సుమనే ధ్వని ఇవన్నీ నువ్వు చెప్పినప్పుడే నేను ఊహించినదంతా సరియైనదని నాకు తెలిసిపోయింది."

"కాని మేం మీ గదిలోకి వచ్చినప్పుడు మాకు ఏ వాయువూ వాసన కొట్టలేదే?"

"గాలికి వాయువు చెదిరిపోయి ఉంటుంది. అదీ గాక ఆ వాయువు తన బరువుకు తనే నేలకి క్రుంగిపోతుంది. సాంద్రతచేత నేల అంతటా సమంగా పరుచుకుంటుంది. కావలిస్తే చూడు!" అంటూ యేల్ ఒక అగ్గిపుల్ల వెలిగించాడు. బాగా అంటుకున్న తరవాత ఆ పుల్లని నెమ్మదిగా నేలకి దగ్గరగా తీసుకువచ్చాడు. తివాచీకి ఒక అంగుళం దూరంలో ఉండగా అగ్గిపుల్ల హఠాత్తుగా ఆరిపోయింది.

"అదా సంగతి" అన్నాడు. పార్.

"ఇల్లంతా సోదా చెయ్యవద్దూ? నేను కూడా ఉంటే మీకేమన్నా సాయపడగలను" అన్నాడు యేల్ కాని పార్ అంత సుముఖత చూపించలేదు

యేల్ చెబుతున్న కథంతా వింటూ, చుటూ చేరిన పోలీసులు ఆశ్చర్య విభ్రాంతులైపోయారు. యేల్ సోదాలో పాల్గొనడానికి పార్ ఎందుకు విముఖత చూపించాడో వారికి అర్థమైంది. యేల్‌కు కూడా అర్థమైనట్లున్నది. అందుచేతనే గాబోలు సరదాగా ఒక మారు నవ్వేసి ఇంటికి వెళ్లి పోయాడు. పోలీసు అధికారులకు కూడా ఒక్కొక్కసారి తమకంటె తెలివైన వారిని చూస్తే కొన్ని విచిత్రభావాలు కలుగుతూ ఉంటాయి. అందుచేత వారివిషయాలలో జోక్యం చేసుకోవడం ఎందుకు లెమ్మని డిటెక్టివ్ యేల్ తనదారిన తాను ఇంటికి వెళ్ళిపోయాడు

## 18. ఫ్లష్ బార్నెట్ చెప్పినది.

మార్ల్ ఇంటిని మరోసారి సోదా చేసి ఇన్‌స్పెక్టర్ పార్ దగ్గరలోనున్న పోలీసు స్టేషనుకు వెళ్ళాడు. ఫ్లష్ బార్నెట్‌ను ప్రశ్నించి కూపీ లాగాలని అతని సంకల్పం.

బార్నెట్ నీరసంగా, నిరుత్సాహంగా ఉన్నాడు. పెద్ద రహస్యాలేమీ అతడు చెప్పలేదు.

స్టేషన్ సార్జెంట్ బల్లమీద బార్నెట్ దొంగిలించిన వస్తువులన్నీ ఉన్నాయి. ఉంగరాలు, గడియారాలు, అతనికెందుకూ పనికిరాని బ్యాంకి బుక్కు, ఒక వెండి ఫ్లాస్కు మొదలైనవి అతడు దొంగిలించాడు. కాని అన్నిటికంటె విచిత్రమైనది బార్నెట్ జేబులో రెండు నూరు పౌనుల నోట్లూ సరికొత్తవి కనిపించడం. ఆ నోట్లు తన సొంతమని అతడు దబాయించాడు.

బార్నెట్ తరహాకు చెందిన దొంగలు జేబులో నాలుగు డబ్బు లాడుతున్నంత కాలమూ దొంగతనం చేసే శ్రమ తీసుకోరు. రెండువందల పౌనుల ధనం చేతులో వుండగా బార్నెట్ మార్ల్ ఇంటిలో దొంగతనాని కెందుకు బయలుదేరాడు?

"ఆ డబ్బు నాదే, మిస్టర్ పార్! నే నబద్ధం ఎప్పుడైనా చెప్పానా?"

"ఆహా! చాలసార్లు చెప్పావు. ఆ డబ్బు నీదే అయితే, ఎక్కడిది నీకు?" పార్ ప్రశ్నించాడు,

"ఒక స్నేహితుడు నాకిచ్చాడు."

"మార్ల్ లైబ్రరీగదిలో నువ్వు మంట ఎందుకు చేశావు?" పార్ అకస్మాత్తుగా ఈ ప్రశ్న వేసేసరికి బార్నెట్ ఉలికి పడ్డాడు

"బాగా చలేసింది - అందుకని."

"ఊ," అని నిట్టూర్పు విడిచి, పార్ తనలో తాను బిగ్గరగామాట్లాడుకుంటున్నట్లు ఇలా అన్నాడు: "తనదగ్గర రెండువందల పౌనులుండగా ఒకడి ఇంట్లో జొరబడ్డాడు. ఇనపపెట్టె బలవంతాన తెరిచాడు. మంట వేశాడు. దేనికి వేశాడు? దేనికి? ఇనపపెట్టెలో దొరికిన దేన్నో తగలపెట్టడానికి!"

బార్నెట్ ఇది వింటూ ఆందోళన పడసాగాడు.

"అందుచేత మార్ల్ ఇంటిలో జొరబడడానికి, ఇనపపెట్టె తెరిచి దేన్నో తగలపెట్టడానికి ఎవరో నీకు రెండువందలు ఇచ్చారన్నమాట. అంతేనా?"

"ఈ క్షణంలో నేను చచ్చిపోతే బాగుండును—" బార్నెట్ మొదలుపెట్టాడు.

"శీఘ్రం విరగడవుతుంది. చచ్చి నరకాన్ని పోతావు. బార్నెట్! నీ స్నేహితుడి పేరు చెప్పు. చెప్పడమే మంచిది. లేకపోతే నీపై హత్యాభియోగం మోపుదామా అని ఆలోచిస్తున్నాను."

"హత్యా?" బార్నెట్ ఒక్క ఉదుటున లేచి నిలబడ్డాడు.

"ఏమిటి మీరనేది? నే నే హత్యా చెయ్యలేదే?"

"మార్ల్ చనిపోయాడు. పక్కమీద ఎలా ఉన్నవాడు అలా చనిపోయాడు."

ఫన్ బార్నెట్ ఈ వార్తతో నిలువునా క్రుంగిపోయాడు. మళ్ళీ ఉదయం పార్ వచ్చి అడిగేసరికి బార్నెట్ ఉన్నదున్నట్టు అంతా చెప్పేశాడు.

"మిస్టర్ పార్! నాకీ గొడవలగూర్చి ఏమీ తెలియదండీ. నేను అబద్ధం చెబితే దేవుడు నన్ను శిక్షిస్తాడు."

బార్నెట్ ఇలా చెప్పాడు: "బ్రబజాన్స్ బ్యాంకిలో పనిచేసే ఒక యువతి నాకు స్నేహితురాలు. ఒక రోజున ఆమె ఆఫీసులో పొద్దుపోయేదాకా పనిచేస్తోంది. నే నామె కోసం ఎదురు చూస్తున్నాను. ఇంతలో బ్యాంకి పక్క ద్వారం నుండి ఒక పెద్దమనిషి వచ్చి నన్ను పిలిచాడు. అతడు నన్ను పేరుపెట్టి పిలవడం ఆశ్చర్యం కలిగించింది. అతని ముఖం చూసి మరింత ఆశ్చర్యపడ్డాను"

"అతడు బ్రబజానేనా?"

"అవునండి. తన ప్రైవేటు గదిలోకి రమ్మన్నాడు. ఏలీమీగా ఏమన్నా చెబుతాడేమో ననుకున్నాను. కాని అతడు మార్‌ను గూర్చి చెప్పసాగాడు. మార్క్ తన్ను బ్లాక్ మెయిల్ చేస్తున్నాడని చెప్పాడు. తన ఉత్తరాలేవో కొన్ని మార్క్ చేజిక్కించుకున్నాడనీ, అవి తన ఇనపపెట్టెలో ఉంటాయనీ, అవి ఎలాగో సంపాదించుకొస్తే వెయ్యి పౌనులిస్తాననీ చెప్పాడు. మార్క్ ఇంట్లో చాలా డబ్బు ఉంటుందని కూడా సూచించాడు. నేను దొంగతనం చేసి జైలుకు వెళ్ళానని అతనికి తెలుసు. నేను ఈ పనికి తగినవాడ్నని తను నమ్ముతున్నట్టు చెప్పాడు. నేను ముందుగా ఒకసారి మార్ ఇల్లు పరిశీలించి చూశాను. లోపలికి జొరబడడం కష్టమని తోచింది. మార్ ఇంట్లో ఎప్పుడూ నౌకరు ఉంటాడు. మార్క్ ఆడవాళ్లను ఇంటికి తీసుకొచ్చినప్పుడు తప్ప ఎప్పుడూ నౌకరు కాపలా ఉంటాడు. అందుచేత మార్క్ ఇంటిలోకి జొరబడాలనే ఆలోచన విరమించుకొందామనుకున్నాను గాని, బ్రబజాన్స్ బ్యాంకిలో మార్క్ కన్నువేసిన ఒక యువతి ఉంది."

"శాలిహ్రమండేనా?"

"అవును సార్. ఆమెని మార్క్ భోజనానికి ఆహ్వానించాడు. అదే అనుకూలము అనుకున్నాను. పైగా ఆనాడే అతడు బ్యాంకిలోంచి డబ్బు తీసుకున్నాడని తెలిసింది.








'అనాసిన్' నాలుగు మందులయొక్క వైజ్ఞానిక మిశ్రమము ఇది నరముల ముఖ్య స్థానములందు తీవ్రమైన మిశ్రమమవ్వనూ జరిపి, నొప్పి, తలనొప్పి, జలుబులు, జ్వరం, పన్నునొప్పి మరియు కండరాల నొప్పులనుండి శీఘ్రవిముక్తిని కలిగించును.

1. క్వైనైన్, అధిక శక్తి నిచ్చు మరియు జ్వరనివారణ మొదలగు గుణాలకు ప్రఖ్యాతి గాంచినది, జ్వరాన్ని తగ్గించడంలో మిక్కిలి శక్తిగలది.
2. కఫీన్, బలహీనానికి మరియు చిక్కిపోయినందులకు తగిన ఔషధమని విరివిగా వాడబడుచున్నది.
3. ఫినాసిటిన్, తీవ్రమైన బాధా నివారణి జ్వర నివారణియని ఖ్యాతిచెందినది.
4. అసిటైల్ సాలిసిలిక్ ఆసిడ్, తలనొప్పి, మరియు అలాంటి బాధలను పోగొట్టుటకు మిగుల ఉపయుక్తమైనది.

ఈ నాలుగు మందులు సరిగ్గా వైద్యునియొక్క ఔషదయోగము వలె పనిచేయును 'అనాసిన్' గుండెకు హాని కలిగించదు లేక కడుపును అపకతపక చేయదు. నొప్పి, తలనొప్పి జలుబులు, పన్నునొప్పి మరియు కండరాల నొప్పులనుండి శీఘ్రంగా సురక్షితమైన మరియు గాఢమైన విముక్తికొరకు ఎల్లప్పుడూ 'అనాసిన్'నే వాడండి.

అతిబాధ నుండికి బాధావిముక్తిని కలిగించును

A 41







మీ క్రొత్త బుష్ షర్టు
క్రుంగకుండా ఉండుటకు
'సాన్ఫొరైజ్‌డ్'
గురుతును గమనించండి

మామూలు బట్టతో తయారైన దుస్తులు క్రుంగిపోవును కొంచెము క్రుంగినా సరే మీ మంచి బుష్ షర్టు పాడయి పోతుంది కాని మీరు కొనే ప్రతి దుస్తుమీద 'సాన్ఫొరైజ్‌డ్' గురుతును గమనిస్తే మీ దుస్తులు చాలనట్లుగా ఎన్నటికీ క్రుంగవు!

'సాన్ఫొరైజ్‌డ్' గుర్తుగల బట్ట ముందుగానే, పూర్తిగా క్రుంగించబడినది ఎన్నో సార్లు ఉతికినా కూడా మీ దుస్తులు చాలనట్లుగా ఎన్నటికీ క్రుంగవు

'సాన్ఫొరైజ్‌డ్' గురుతును ఎల్లప్పుడూ గమనించండి!

సాన్ఫొరైజ్‌డ్ సర్వీస్, 'పారిజాత్', నేతాజీ సుభాష్ రోడ్,
మెరీన్ డ్రైవ్, బొంబాయి 2

రేడియో సిలోన్‌లో 'సాన్ఫొరైజ్‌డ్-కె-మెహమాన్' ప్రోగ్రాముకు వినండి
ఆదివారములు మధ్యాహ్నము 12-45 గం|లకు 31 మీటర్లమీద
మంగళవారములు రాత్రి 7-30 గం|లకు 41 మీటర్లమీద.

ACP 2826


# అరుణవలయం

సునాయాసంగా బోలెడు డబ్బు ఆర్జించవచ్చునని ఆలోచించాను. ఇనపపెట్టె తేలికగా తెరిచాను ఒక కవరు కనిపించింది. అందులో కాగితాలేమీ లేవు. ఒక ఫొటో మాత్రం ఉంది ఆ ఫొటోలో ఒక స్త్రీ, ఒక పురుషుడు ఒక కొండ శిఖరాన ఉన్నారు. ఏదో విదేశంలోని దృశ్యమై ఉంటుంది. ఎందుకంటే వెనకాల చాలా పర్వతాలు కనిపిస్తున్నాయి ఆమెను ఆ పురుషుడు కిందికి తోసేస్తున్నాడులా ఉంది. ఆమె ఒక చెట్టును పట్టుకుని తప్పించుకొన జూస్తోంది ఏదో సినిమా బొమ్మ కాబోలనుకున్నాను ఏమైనా, దాన్ని తగలపెట్టేశాను"

"ఊఁ తరవాత? అంతేనా?"

"అంతేనండి డబ్బేమీ దొరకలేదు"

సరిగ్గా ఏడుగంటలకు వారంటుతీసుకుని ఇన్‌స్పెక్టర్ పార్ ప్రబజాన్ నివసించే గృహానికి వెళ్ళాడు కూడా ఇద్దరు డిటెక్టివులను తీసుకు వెళ్లాడు.

నౌకరొకడు తలుపు తెరిచి ప్రబజాన్ పడకగది చూపించాడు. తలుపులోపల గడియవేసిఉంది పార్ నాలుగు తాపులు తన్ని తలుపు తెరిచాడు. గదిలో ఎవరూ లేరు కిటికీ తెరిచిఉంది ఇంటికి నిప్పంటుకున్నప్పుడు కిందికి సురక్షితంగా దిగడానికుపయోగించే సాధనం ఉన్నది దాని ద్వారా ప్రబజాన్ పారిపోయిఉంటాడని పార్ ఊహించాడు. శయ్య ఎక్కడా నలిగిపోయిన సూచన కనిపించలేదు కనుక, ఇన్‌స్పెక్టరు రావడానికి కొన్నిగంటలముందే ప్రబజాన్ పారిపోయిఉంటాడు.

శయ్య పక్కనే ఒక టెలిఫోనుఉన్నది. పార్ టెలిఫోన్ ఎక్స్ఛేంజికి డయల్ చేశాడు.

టెలిఫోన్ ఆపరేటరును పిలిచి "ఈ నంబరుకు గతరాత్రి ఏవైనా పిలుపులువచ్చాయేమో చెప్పగలవా?" అని అడిగాడు.

"రెండు వచ్చాయి ఒకటి బేస్‌వాటర్ నుంచి—"

"అవును నేనే అప్పుడు ఫోనుచేశాను. రెండోది?"

"రెండోది రాత్రి రెండున్నరకు వెస్టర్న్ ఎక్స్ఛేంజినుంచి—"

"సరే" అని ఫోను పెట్టేశాడు.

పార్ తన అనుచరులకేసిచూసి ముక్కు నలుపుకుంటూ,

"థాలియా ప్రెమండ్ మరో ఉద్యోగం చూసుకోవలసిందే" అన్నాడు

(ఇంకాఉంది)




# ప్రథమ పంచవర్ష ప్రణాళికలో కుటుంబ సంక్షేమం

స్వతంత్ర భారతములో ప్రథమ పంచవర్ష ప్రణాళిక ముగిసింది. రెండవ ప్రణాళిక తయారవుతున్నది. ఈ అయిదు సంవత్సరాలలో దేశమందంతటా ప్రజాభ్యుదయకరమైన కార్యక్రమాలు క్రతువు సాగినట్లు సాగిపోయినాయి. అంతకుముందు మనదేశములో సంఘాభ్యుదయానికై కృషిచేయగల సంస్థలు తప్ప సమగ్రమయిన జాతీయ కార్యక్రమాలు ఏర్పడలేదు. ప్రజా సంస్థలు, ప్రత్యేక సంఘాలు, స్వచ్ఛందసేవాదళాలు, పురపాలక సంఘాలు యథాశక్తితో సంఘసేవ చేస్తూఉండేవి. స్వతంత్ర భారతములో కేంద్ర సాంఘిక సంక్షేమ సమితి నెలకొల్పబడి నిర్విరామముగా కృషిచేస్తున్నది. స్త్రీ శిశు జనసంక్షేమ కార్యక్రమాలు దీనిలో చేరినవే. కేంద్ర సాంఘిక సంక్షేమ సమితికి శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్ అధ్యక్షురాలు. పంచవర్ష ప్రణాళికలో స్త్రీ శిశు జనాభ్యుదయానికొని ప్రత్యేకమయిన సమితి నిర్మాణమయినది. పథకాలు సిద్ధము చేయబడ్డాయి. వీటననుసరించి కార్యక్రమాలు జరుపటానికి కేంద్ర సమితి పక్షాన రాష్ట్రమున కొకటివంతున 28 రాష్ట్రాలలో శాఖలు నెలకొల్పబడ్డాయి.

భారతదేశములో 1951 లో ప్రచురింపబడిన రిపోర్టుననుసరించి నూటికి 51 వంతున స్త్రీలసంఖ్య ఉన్నదని తేలినప్పటికీ కొన్ని ప్రాంతాలలో స్త్రీలకంటె పురుషులే అధిక సంఖ్యాకులు ఉన్నారు. మదరాసు, తిరువాన్కూరు-కొచ్చిను, ఒరిస్సా, కచ్ఛ్, మణిపూర్ లెక్కలలో స్త్రీలసంఖ్య అధికము.

## ఇల్లిందల సరస్వతీదేవి

ఈ రిపోర్టు ననుసరించి మనదేశములో స్త్రీకి వివాహవయసు సగటున పన్నెండు సంవత్సరాలనుండీ 30 సంవత్సరాల పైన కూడానని తేలినది. వివాహమయిన స్త్రీకి నలుగురు మాత్రమే జీవముతో ఉన్న శిశువులు జన్మిస్తున్నారు. వారిలో నూటికి 70 మాత్రమే బ్రతుకుతున్నారని తేలినది. స్త్రీల వివాహవయస్సు శిశుసంఖ్యను తగ్గించగలదని భావింపబడలేదు కాని శిశుమరణసంఖ్య తగ్గగలదని భావింపబడ్డది.

శిశువులలో మొదటి సంవత్సరము మృతినొందే వారి సంఖ్య అధికము. వీరిలో నూటికి 60 వంతున పుట్టిన మొదటి వారములో మరణించినవారుంటారు. అయిదు సంవత్సరాలు దాటిన తరువాత మరణసంఖ్య కొంత తగ్గుతున్నది. స్త్రీలలో 15 సంవత్సరాలనుండి 29 సంవత్సరాల వయసులో ఉన్నవారి మరణసంఖ్య అధికము. వీటి నరికట్టటానికి గాను మాతా శిశువులను అభివృద్ధికొరకు సంక్షేమ సమితి కార్యక్రమాలను ఏర్పరచింది. అనేక కేంద్రాలు దేశమందంతటా నెలకొల్పబడ్డాయి.

ప్రసూతి శిశు రక్షణాల బ్యూరో ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ చేత నెలకొల్పబడి ఆ శాఖలలో పని చేసేవారికి శిక్షణ నివ్వబూనుకొన్నది. మాతా శిశు రక్షణాల విషయము ప్రత్యేకముగా చదివి కృషి చేయ

# ప్రథమ పంచవర్ష ప్రణాళికలో కుటుంబ సంక్షేమం

బూనుకొన్న వైద్య విద్యార్థులకు (The lady chelmsford League Fund) స్కాలర్ షిప్పు ఇవ్వటానికి నిర్ణయింపబడ్డది.

బొంబాయిలో మాతా శిశు రక్షణ సంఘము సంచార వైద్యాలయముతో చుట్టు ప్రక్కల గ్రామాలలో వైద్యము చేయటానికిగాను నెలకొల్పబడ్డది. ఈ సంఘము వద్దనున్న మోటారు కార్లలో ఔషధాలతో వైద్యులు తమ సిబ్బందిని తీసుకొని ఇండ్లకు వెళ్ళి చికిత్స చేస్తారు. ప్రమాదకరమయిన కేసులనూ, అత్యవసరమయిన కేసులనూ వైద్యాలయానికి తీసుకొని వచ్చి వైద్యోపచారాలు చేస్తారు.

ఈ సమితి యాజమాన్యాన బిడ్డల కై నర్సరీ పాఠశాలలు నెలకొల్పబడ్డాయి. బిడ్డల నందరినీ పరీక్షించి లోపాలను తల్లిదండ్రులకు తెలుపటానికి శిశు కేంద్రాలు నెలకొల్పబడ్డాయి. బలహీనముగా ఉన్న బిడ్డలకు ఉచితముగా పాలు, కాల్షియము, కాడ్ లివర్ ఆయిలు, గ్లూకోజు మాత్రలు ఇవ్వబడుతున్నాయి. శిశువుల ఆరోగ్యాన్ని పెంపొందించటానికీ, ప్రజలలో ఆ విజ్ఞానాన్ని ప్రచారము చేసి వారిని ప్రోత్సహించటానికీ శిశు ప్రదర్శనాలు ఆరంభింపబడ్డాయి.

ఢిల్లీలో నజఫ్ గఢ్ లో మాతా శిశువుల ఆరోగ్యాభివృద్ధికై ప్రత్యేక దృష్టితో కృషి చేయటానికి ఆదర్శ ఆరోగ్య సేవా సంఘము నెలకొల్పబడ్డది. ఈ కేంద్రము ఢిల్లీ నగరములో ఉన్న అనేక ఇతర సంస్థలలో పనిచేసే సేవికలకు శిక్షణాలయముగా కూడా ఉపయోగపడుతున్నది. సైనిక కుటుంబాల ఆరోగ్యసంరక్షణకై పట్టము సందుకొన్న వైద్యులు, నర్సులు పనిచేసే ఆరోగ్యకేంద్రాలు నెలకొల్పబడ్డాయి:

కర్మాగారాలలో కార్మికుల యోగక్షేమాలవిషయములో ప్రత్యేక సౌకర్యాలను కల్పించాలన్న దృష్టి ఏర్పడ్డది. కార్మికుల యోగక్షేమాలకై విధిగా కొన్ని సౌకర్యాలను కల్పించి తీరాలన్న శాసనముకూడా అన్ని రాష్ట్రాలలోను చేయబడ్డది. కొన్ని పరిశ్రమాగారాలు మాతా శిశువుల సంక్షేమ కేంద్రాలను నడపటమే కాకుండా, కార్మికురాండ్రకు మాతృత్వాన్ని పోషించి రక్షించుకోవటానికి తగిన పరిజ్ఞానాన్ని కల్పించటానికి కూడా కృషి చేస్తున్నాయి.

భారతదేశములో నెలకొల్పబడిన శిశు కేంద్రాలన్నిటికీ యునెసెఫ్ నేషన్సు వారి అంతర్జాతీయ శిశునిధినుండి ధనసహాయము లభిస్తున్నది. ఈ నిధి ప్రత్యేకముగా ఈ శిశువులకు తల్లిగర్భములో ఉన్నప్పటి నుండీ తగిన సంరక్షణ జరగటానికై నర్సులకూ, హెల్తువిజిటర్లకూ శిక్షణ నిస్తున్నది; గ్రామాలలో నివసించే తల్లులకు శిశుసంరక్షణకు వలసిన పరిజ్ఞానాన్ని కలిగిస్తున్నది. మంత్రసానులను దాయీలను తగినవస్తు పరికరాలతో సహితముగా గ్రామాలలో నియమించటము జరుగుతున్నది. ప్రసూతి సమయాలలో తీసుకోవలసిన జాగ్రత్తలనూ రక్షణోపాయాలనూ తెలిసికోవటానికి దాయీలకు తగిన శిక్షణ ఇవ్వబడుతున్నది. ప్రసూతికి అవసరమయిన పరికరాలుగల పెట్టెలు సప్లయి చేయబడుతున్నాయి. ప్రధానముగా ఈ కార్యాలకై యునైటెడ్ నేషన్సు వారినిధి వినియోగింపబడుతున్నది.

గతమూడు దశాబ్దాలనుండీ వస్తూత్పత్తి కంటె జనాభా ఎక్కువగా పెరిగిపోయినది. ఈ జనాభా పెరుగుదలవలన ప్రజల ఆరోగ్యములోను, అభ్యుదయములోను దుష్ఫలితాలు సంభవించాయి. ప్రజాసంక్షేమదృష్ట్యా ప్రణాళికా సంఘమువారూ, ప్రభుత్వము కుటుంబములోని వ్యక్తుల సంఖ్యను పరిమితము చేయటము, జనాభా పెరుగుదలను ఆపు చేయటము, అవశ్యకమని భావించారు. 1951 జనాభా లెక్కల ప్రకారము గత 30 సంవత్సరాలలో (1921-1951 వరకు) పదకొండు కోట్ల జనసంఖ్య పెరిగింది. ఇదే విధముగా జనాభా పెరిగినట్లయితే (1951 నుండి 1981 వరకు) 30 సంవత్సరాలలో 36 కోట్లనుండి 52 కోట్ల వరకు జనాభా పెరుగగలదని అంచనా వేయబడ్డది

జనాభా పెరుగుదలను తగ్గించటానికిగాను కుటుంబాలలోని బిడ్డల సంఖ్యను పరిమితము చేయవలసి ఉంటుంది దీనికి తగిన కార్యక్రమాలను ఏర్పరచటానికి ఒక విధానాన్ని అవలంబించవలసి ఉంటుంది. అందుకు తగిన పరిశోధనలు చేయటానికి ప్రభుత్వము ఒక కమిటీని నియామకము చేసింది. (Family planning Research and Programme Committee) పరిశోధన తర్వాత ఆకమిటీ ఈ క్రింది సలహాలను ఇచ్చింది.

1. కుటుంబాలను పరిమితి చేసే కార్యక్రమాలు కేవలము బిడ్డల సంఖ్యను పరిమితము చేయటమే కాదు. స్త్రీలకు కొన్ని కొన్ని కారణాల వల్ల ఉంటున్న వ్యత్యాసము ఎక్కువయేటట్లు చూడాలి (అంటే దూరపు కాన్పులు) సాంఘిక ఆర్థిక ఆరోగ్య సంస్కృతుల దృష్ట్యా ఈకుటుంబాల అభివృద్ధి సంఘ సంక్షేమానికి తోడ్పడేటట్లుగా ఈ కార్యక్రమాలు వ్యవస్థీకరింపబడాలి.

2. వైద్యాలయాలలోనూ, ప్రసూతి గృహాలలోను, మాతా శిశువులకు ఏర్పాటు చేయబడిన సంక్షేమ కేంద్రాలలోను (Welfare centres) కుటుంబాలను పరిమితము చేసుకోటానికి తగిన సలహాలనిచ్చే కేంద్రాలను (Famely planning centres) స్థాపించాలి. ఈ కేంద్రాలను ప్రత్యేకముగా విడిగా స్థాపించినదానికంటె వీనాటికి అనుసంధించటమే ఎక్కువ సముచితము.

3. కుటుంబాలను పరిమితము చేసుకోవటాన్ని గురించి తగిన ప్రచారము ప్రజలలో జరుగవలసి ఉన్నది. రేడియో, సినిమాల ద్వారా ఈ ప్రచారము చేయాలి. సంస్థలు కూడా ఈ పని చేయవచ్చు. ఈ ప్రచారా

శ్రేష్ఠతమము
అశోకా
స్నో
స్త్రీ
సౌందర్య
అతిశయమునకు
ముఖ
వికాసమునకు
ASOKA SNOW
AN EXCELLENT CREAM
విజయా కెమికల్స్
మద్రాస్-7.

నికి పూనుకొన్న సంస్థలన్నిటికీ తగిన ధనస హాయము ప్రభుత్వము చేయవలసి వుంటుంది.

ఈ సలహాల ననుసరించి మొదటి పంచవర్ష ప్రణాళికలో కుటుంబాలను పరిమితము చేసే కార్యక్రమాలకొరకు ప్రభుత్వమువారు 65 లక్షల రూపాయలు ప్రత్యేకించారు.

ఈ కార్యక్రమాలను కొనసాగించటానికి వైద్యులకు; మంత్రసానులకు, సంఘ సేవకులకు మూడు నెలల శిక్షణ నీయవలెనని కమిటీ ఇచ్చిన సలహా ననుసరించి బెంగుళూరులో ప్రప్రథమముగా ఒక శిక్షణకేంద్రము ఏర్పాటు చేయబడ్డది. 15 మంది వైద్యులు 5 మంది హెల్తు విజిటర్లు ఈ శిక్షణపొందారు.

పై కమిటీవారు చేసిన సలహాల ననుసరించి అఖిలభారత మహిళాసంఘము, ఫ్యామిలీప్లానింగు ఎసోసియేషన్ ఆఫ్ ఇండియా, మొదలయిన సంఘాలచేత ఏర్పాటు చేయబడిన జన్మనిరోధక సంస్థలు దేశమందందంతటా పనిచేస్తున్నాయి. బొంబాయి నగరములో 17 కేంద్రాలున్నాయి. దేశము మొత్తముమీద 165 కేంద్రాలలో ఈ కార్యక్రమము నిర్వహింప బడుతున్నది.

కుటుంబాభ్యుదయానికై ఏర్పడిన ఈ కార్యక్రమాలు స్త్రీ జనాభ్యుదయానికై సిద్ధము చేయబడిన పథకములో ఒకభాగము మాత్రమే. ఆ పథకాన్ననుసరించి నిర్వహింపబడిన కార్యక్రమాలు, కేంద్రాలు శాఖలూ ప్రత్యేకముగా పేర్కొనతగినవి. ★

# నీతిలేని మానవులు

(27-వ పేజీ తరువాయి)

శేఖరం మనస్సు తప్పుచేస్తున్నట్టు బాధపడ్డది.

"అయినా ఒకళ్ళకి మాటిచ్చి, ఇంకోళ్ళని చేసుకోవటం అన్యాయం కాదు నాన్నా?" అని అస్పష్టంగా గొణిగాడు.

"ఓస్! ప్రధానానికే పెద్ద పెళ్ళయినట్టు చెబుతావేంరా? పీటలమీద పెళ్ళిళ్ళే తప్పిపోతాయి. ప్రధానానికో లెక్కా? అదీకాక ఇందులో మనం చేసే అన్యాయం ఏముంది? మనం చేసుకోకపోతే ఆపిల్ల వూరికే వుండిపోతుందా యేం? ఇంకో సంబంధాన్ని తీసుకొచ్చి ముడిపెట్టేస్తాడు—దాంతో సరి—అన్యాయంఏమిటి—అన్యాయం? అదీగాక యిప్పుడు మనం ఆపిల్లను చేసుకోకపోవటం అతనికోకందుకు మేలేఅనుకో. ఆ కాస్త కొంపా అమ్మి రెండువేలు మనముఖాన్ని పోసేస్తే రేపొద్దున అతను నిలబడటానికి చోటేది? పాపం! అతన్ని యిబ్బంది పెట్టిన వాళ్ళమవుతాం" అని పరంధామయ్య తన ఉదారబుద్ధిని వెళ్ళబోశాడు.

శేఖరం మౌనంగా కూర్చొని శైలజమూర్తిని మననం చేసుకుంటూ మనస్సులో తర్జనభర్జనలు చేసుకుంటున్నాడు.

"ఈ యిల్లు చూడు, ఈ వాకిలి చూడు. ఎక్కడ చూసినా లక్ష్మి పిలిస్తే పలుకుతున్నది. ఐదువేలు కట్నం యిచ్చి వైభవంగా పెళ్లి చేస్తాడు. ఆతర్వాత నువ్వు ఎప్పుడిక్కడికి వచ్చినా చక్కగా మర్యాద చేస్తారు. ముద్దూ ముచ్చటా తీరుస్తారు. 'హిమ'ను చేసుకుంటే ఏముందిరా నా తలకాయ? శైలజను చేసుకున్నావంటే ఏది కావాలంటే అదే ఇస్తాడు. ఆఖరుకు ఫారిన్ వెళ్తానన్నా పంపించగలడు".

"ఇతను ఒప్పుకుంటాడా? ఎంతైనా స్నేహితుడికి ద్రోహం..." అని ఆగాడు శేఖరం సందేహంగా చూస్తూ.

పరంధామయ్య అట్టహాసంగా నవ్వాడు. "ఆ నీతులకేం లేరా? నీకు బొత్తిగా లోకజ్ఞానమే లేదుగా! మనల్ని వాళ్ళింట్లో చూసినప్పుడే కనిపెట్టాను అతనేదో పథకం వేస్తున్నాడని. నువ్వు మొండికేసి కూర్చున్నావుకాని పాతికేళ్ళ వయస్సుకల్లా మొగపిల్లలు పెళ్ళి చేసేసుకోరూ? అలాంటిది ఆడపిల్లలు పాతికేళ్ళవరకూ పెళ్ళికాకుండా వుండిపోతే సంబంధాలేం వస్తాయి? చూడబోతే నువ్వు శైలజకోసమే యిన్నాళ్ళు ఆగావేమో ననిపిస్తున్నది. చదువుకున్న పిల్ల. ఆ మాత్రం వయస్సు లేకుండా ఎలా వుంటుందిలే నీకు అన్నింటిలోనూ ఈడు జోడుగా వుంటుంది. ఆ 'హిమ'కు వంటలప్పు తప్ప మరేం వచ్చు? నీతో సరదాగా ఇంగ్లీషులో మాట్లాడగలదా ఏమన్నానా?"

శేఖరం నవ్వాడు. "నీ యిష్టం వచ్చినట్టు చెయ్ నాన్నా"

పరంధామయ్య తృప్తిగా శేఖరం భుజం తట్టాడు.

* * *

ఎన్ని ఉత్తరాలువ్రాసినా జవాబు రాకపోయేసరికి సోమసుందరం చాలా గాబరాపడి గుంటూరుకువెళ్ళే ప్రయత్నంలో వున్నాడు. ఇంతలో హఠాత్తుగా శేఖరం వివాహవార్త విని సోమసుందరం కుప్పకూలిపోయాడు.

సోమసుందరానికి తలకాయ గిఱ్ఱున తిరుగుతున్నది...

'హిమ' పెళ్లిసంగతి ఎత్తగానే మూర్తి ముఖం మలినమయ్యింది ఇందుకేనా? ఇంతటి దురాలోచన తనమీదసాగించాలా? హిమకు తను యింకో సంబంధం తేగలడు? ఒకవైపు అభ్యుదయ యువకులంతా కట్నం నిషేధానికి కృషిచేస్తుంటే, ఇంకోవేపు నుంచి ఆడపిల్లల తల్లిదండ్రులు ఒకళ్లకొకళ్లు పోటీపడి చిత్తచాంచల్యం కలిగిస్తున్నారు. యువకులేంచేస్తారు పాపం? ఆశ ఎంత మంచివాళ్లనైనా లొంగితీస్తుంది ఏది ఏమైనా—హిమకు పెళ్లెలా అవుతుంది.

"హిమా! హిమా! నీతిలేని మానవులంతా కలిసి నిన్నూ, నన్నూ ఎలా వంచిస్తున్నారో చూడు" అంటూ సోమసుందరం గోడకేసి తిరిగి తల బాదుకున్నాడు. ★


జెనెక్స్ అలారం గడియారము

భారతదేశమునకై ప్రత్యేకముగ తయారుచేయబడినది



దిట్టమైన నికెల్ కేసు, సాదా డయలుతో రు. 23/-

కొంచెము ఎక్కువ ధరకు ఎఱ్ఱని లక్క రంగు లేక దంతపు రంగు అంచుగలది దొరకుతోంది

రోలెక్స్ వాచ్ కంపెనీ (ఈస్టరన్) ప్రైవేట్ లిమిటెడ్

దక్షిణ భారతదేశమునకు ఏకైక డిస్ట్రిబ్యూటర్లు:

పి. ఆర్ అండ్ సన్స్ ప్రైవేట్ లిమిటెడ్

మౌంట్ రోడ్, మద్రాసు

# ఓటమి

మధురాంతకం రాజారాం

వేటలో నిపుణులైన భటులు కొందరు వెన్నంటిరాగా భోజరాజు మృగయా వినోదంకోసం ధారానగరానికి రెండు ఆమడల దూరంలో గల అరణ్యానికి బయల్దేరాడు. ఆస్థానకవీంద్రుడు కాళిదాసుకూడా రాజుగారిని వెంబడించాడు.

మిట్టమధ్యాహ్నమైంది. భోజరాజు కవితోబాటు ఒక మర్రిచెట్టు నీడలో కూర్చుని సేద తీర్చుకుంటూ మెల్లగా సంభాషణకు వుపక్రమించాడు. భటులు దూరంగా ఎక్కడో వంటలు చేసుకుంటున్నారు.

ఇంతలో కూతవేటుదూరంలో వున్న చెట్లమాటునుంచీ ఒక పులి గాండ్రించడం అక్కడికి భయంకరంగా వినిపించింది. భోజరాజు ఖడ్గహస్తుడై లేచి నిలబడి "పులివేట ప్రత్యక్షంగా చూడాలన్న కుతూహలమూ, చూడ్డానికి కావలిసిన ధైర్యమూ వున్నట్టయితే మీరూ నాతో రావచ్చు" అని కాళిదాసుతో నుడువుతూ, పులి అరుపు వినవచ్చిన వైపుకు వేగంగా నడవసాగేడు.

పిరికివాడనిపించుకుని రాజుగారి ఎదుట కించపడడానికి ఇష్టంలేక కాళిదాసు ఆయనను అనుసరించాడు. ఏపుగా పెరిగిన మద్దిమ్రానులమధ్య ఒక చిన్న సెలయేరు ప్రవహిస్తోంది. ఆయేటిప్రక్కన చల్లటినీడలో పడుకుని పులి ఆవలిస్తోంది.

"పృథ్వీపతీ! అదిగో పులి" అన్నాడు కాళిదాసు.

"మీరు యిక్కడేవుండి చూస్తూ వుండండి" అంటూ భోజరాజు వెనుకనుంచీ పులిని సమీపించాడు. తొందరగా నడవడంలో ఎండుటాకులు గలగలమన్నాయి. పులి ఫులికిపడిలేచి అటూ, యిటూ చూచింది. రాజు ఒక్క అంజతో ముందుకు దూకి పులిపైకి కత్తి విసిరాడు. కాని పులి వెంట్రుకవాసిలో దెబ్బ తప్పించుకుని సెలయేరు దాటి ఆవలివైపు కీకారణ్యంలోకి కాలికొద్దీ పరుగెత్తసాగింది. దాని వెనువెంట రాజు, ఆయన వెంబడి కాళిదాసు పరుగెత్తసాగారు.

అలా ఎంతదూరం పరుగెత్తారో వాళ్లకు తెలియదు. తీక్ష్ణంగావుండిన సూర్యకిరణాలు క్రమక్రమంగా చల్లబడి పోయాయి. శరవేగంతో పరుగుతీస్తూ పెద్దపులి ఏ పొదల చాటునో కనుమరుగై పోయింది. ఆయాసంతో రాజు, కవీ ఒక బండపైన కూచున్నారు.

తేరుకున్నతర్వాత కాళిదాసు రాజువైపు తిరిగి "ప్రొద్దు వాటారిపోయింది ధరణీపతీ! ఈ రాత్రికి మనం ఈ అరణ్యంలోనే వుండిపోవడం దేవరవారికి అభిమతం కాదుగదా!" అన్నాడు.

"లేదు లేదు. మనకోసం భటులు ఎదురు చూస్తుంటారు. వెళ్దాం పదండి" అంటూ రాజు పైకి లేచాడు. ఇద్దరూ నడవసాగారు.

కాని ఎంతదూరం నడచినా వాళ్లు బయల్దేరినచోటు చేరుకోలేక పోయారు. తనపని తీరిపోయినట్టు సూర్యుడస్తమించాడు. దారితెన్నూలేని అరణ్యంలో దారి తప్పిన భోజరాజు దిక్కులు తోచక కాళిదాసును చూస్తూ "ఇక మనం నడిచి ప్రయోజనం లేదు. ఇక్కడికి ధారానగరం ఏవైపున వున్నదని కూడా నేను వూహించుకోలేక పోతున్నాను" అన్నాడు.

"ఐనా మరి కొంతదూరం నడుద్దాం అవనీపతీ! అప్పటికి చంద్రోదయం కూడా అవుతుంది" అన్నాడు కాళిదాసు.

మళ్ళీ ప్రయాణం కొనసాగింది. అటు చంద్రుడు వుదయించడమేమిటి, యిటు రాజుగారికీ, కవిగారికీ ఒక కాలిబాట కనిపించడమేమిటి ఒక్కసారే జరిగాయి.

"ఈ బాట మనల్ని ధారానగరానికి కాకపోయినా ఒక చిన్న కుగ్రామానికైనా తీసుక వెళ్ళదా మహారాజా" అన్నాడు కాళిదాసు.

అందుకు సందేహ మేమిటి? మనం దుర్గమారణ్యాన్ని దాటి, అడవి పొలిమేరలో నడుస్తున్నాం ఇంకొక్క అర్ధక్రోసు దూరంలో మనకు ఆశ్రయం దొరకవచ్చు” అన్నాడు భోజరాజు

రాజుగారి అంచనా నిజమైంది చంద్రబింబం నాలుగు బారలు ప్రొద్దెక్కే సరికి రాజూ, కవీ కాలిబాట ప్రక్కన ఒక గుట్ట చెంత వున్న చిన్న పూరి గుడిసె ముందు నిలబడి మెల్లగా తలుపుతట్టారు

“ఎవరు వారు” అంటూ ఒక ముసలావిడ తలుపు తెరిచింది

“ఎవరైతేనేంలే అవ్వా! దారి తప్పిన బాటసారులం ఈ బాట ఎక్కడికి పోతుందో చెప్పగలవా నువ్వు” అన్నాడు కాళిదాసు

ముసలావిడ ఏమీ అర్థం కానట్టు కాళిదాసు కేసి విచిత్రంగా చూస్తూ “బాట ఎక్కడికి పోతుంది బాబూ! దానికేం కాళ్లున్నాయా ఒకచోట నుంచీ మరొకచోటకు నడవడానికి. అదెక్కడికీ పోదు. మనుషులు మాత్రం దానిపైన రాకపోకలు సాగిస్తుంటారు. అదలావుండనీ! మీ రెక్కడినుంచీ వస్తున్నారు?” అంది.

“మేము యాత్రికులం అవ్వా! కాశీక్షేత్రంనుంచీ వస్తున్నాం” అన్నాడు కాళిదాసు

“మీరు యాత్రికులా! పరాచికాలాడడానికి మీకీ ముసలిది దొరికిందా బాబూ! లోకంలో సూర్యచంద్రులిద్దరుమాత్రమేకదా యాత్రికులు! మిగిలినవాళ్లు యాత్రికులంటే నేను నమ్మను” అంది వృద్ధురాలు.

ఈసారి మహాకవి కొంచెం

## [illegible]

వజ్రపాణి

కోటయ్య సెట్టిగారింట
కోట్ల కొలదిగ ధనము కలదు,
వెండి బంగారములు కలవు,
దండిగా భూవసతి కలదు

కోటయ్యభార్య కాటమ్మ,
కాటమ్మ యుక్తిపరురాలు!
వారి సంపద దొంగిలింప
చోరు డొక్కడు తలచుచుండె!

ఒక్కనాడా దొంగవాడు
చక్కగా యింటిలో దూరి,
అటకపై దాగియున్నాడు!
అది గ్రహించినది కాటమ్మ!

ఓటిదగు నొక బిందెయందు
కాటమ్మ రాళ్ళు నింపినది!
బిందె మూతికి కట్టుకట్టి
ప్రియభర్తకై యెదుచూచె?

బాగుగా రాత్రియగు పిదప
వచ్చెనింటికి సెట్టిగారు,
ఆరగించుచు బిందె చూచి
“అట్లేల కట్టితివి?” అనెను.

అటకపై నున్నట్టి దొంగ
ఆలకించెడి విధముగాను
అతని సతి చెప్పినది “బిందె
యందు ధనమును నింపినాను!

మన దొడ్డిలో నూతియందు
మఱి కొంచెము నీరులేదు!
దానిలో ఈ బిందె దాచు
చో, నిర్భయముకదా! మనకు”

ఆ భారమయినట్టి బిందె
అతి కష్టమున మోసినారు—
వారు నూతిని చేరులోన
చోరుడును వెలుపలకు వచ్చె!

ఆ తన్వియును, సెట్టిగారు
నూతిలో బిందె పడవైచి,
తిరిగి తమ గది చేరినారు—
మఱి దొంగవాడు గమనించె

“నూతిలో నీరు లేదనుచు
ఆతన్వి చెప్పినది కాదా?
ఆలస్య మింకేల?” అనుచు
అతడు కూపము తొంగిచూచె

అపుడు చీకటి రాత్రి కనుక
అందు కానరాదాయె జలము!
నీరు లేదని యెంచినట్టి
చోరుడందున దుమికి మునిగె!!

తీవ్రంగా ఆలోచించి “మేము అనిత్యమైన జీవితంగల మానవులం అవ్వా” అన్నాడు

“ప్రపంచంలో అనిత్యమైనవి రెండే రెండు ఒకటి యౌవనం, రెండోది సంపద వాటితో పోల్చి చూచినప్పుడు జీవితం అనిత్యం కాదే!” అంది ముసలావిడ

భోజరాజుకు చిరాకు కలిగింది అతడు కొంచెం కటువుగా

"చూస్తుంటే తెలియడంలేదా అవ్వా! మేము రాజులం!" అన్నాడు.

"రాజులా నాయనా! బాగా చెప్పావు అప్పటికి నేనంత మతిలేని దాన్ననా నీ అభిప్రాయం లోకంలో రాజులిద్దరే ఒకడు నెలరాజు, ఇంకొకడు ధర్మరాజు. ఐనా నాతో మీకీ కుతర్కాలెందుకు? వాస్తవంగా మీ రెవరో ఒక్కమాటతో చెబుతే సరిపోదా" అంది వృద్ధురాలు.

భోజరాజుకీసారి కోపమే వచ్చింది. అతడు రెండడుగులు ముందువేసి "మహాతల్లీ! మేము ఓర్పు అన్న భూషణం ధరించిన వాళ్లం కాబట్టి సరిపోయింది. లేకుంటే నీకీపాటికి ఎలాటిదుర్గతి పట్టివుండేదో కదా" అన్నాడు.

"అదేమిటి బాబూ! ఓరిమిని అలంకారంగా గలిగిన వాళ్ళలో ఒకతె భూదేవి, మరొకతె మానవాంగన. దుస్తులు బట్టి చూస్తే మీకూ పైవాళ్ళకూ పోలికలేవీ కనబడడం లేదే" అని విస్మయం ప్రకటించింది ముసలావిడ.

"మమ్మల్ని విసిగించకమ్మా తల్లీ! తిరిగి తిరిగీ అలసిపోయాం. వాస్తవానికి మేము పరదేశస్థులం" అన్నాడు కాళిదాసు

"పరదేశస్థులా నాయనా మీరు! ఏంమాట! ఒకటి పుట్టనైనాపుట్టాలి లేకుంటే చావనైనా చావాలి. అప్పుడు గానీ పరదేశానికి వెళ్లడం సాధ్యపడదు. పుట్టడమంటే పరదేశానికి రావడం. చావడమంటే పరదేశానికి పోవడం"

రాజు కవిగారి ముఖం చూచాడు. కవి రాజుగారి ముఖం చూచాడు "ఓడిపోయాం, ఓడిపోయాం" అన్న భావం ఆ చూపుల్లో వ్యక్తమైంది ఇక ఓటమిని అంగీకరించడమే సమంజస మనుకున్న కాళిదాసు "అవ్వా! ఇంకా వెయ్యిమాటలెందుకు? నీ దగ్గర మేము ఓడిపోయాం" అన్నాడు

"అదేమిటి బాబూ! లోకంలో ఓడిపోయే వాళ్లిద్దరు ఒకడు అప్పు తీసుకున్నవాడు! మరొకడు ఆడుబిడ్డను కన్నతండ్రి. వాళ్ళకు తప్ప మరెవ్వరికీ ప్రపంచంలో ఓటమి లేదే" అంది ముసలావిడ.

సిగ్గుతో మహాకవి తలవంచుకున్నాడు భోజరాజు ముఖం వెలవెల బోయింది. వాళ్ళను చూచి ముసలావిడ నవ్వుతూ "ఎంత గడుసరివాళ్లు బాబూ మీరు! మీ రెవరో నాకు తెలియ దనుకుంటున్నారు గదూ! పొరబాటు ఈ రాజ్యంలో మిమ్మల్ని తెలియనివాళ్లెవరు? వేటకు వెళ్ళి అరణ్యంలో దారి తప్పినట్టున్నారు. ఇటే వెళ్లండి. ఇదే ధారానగరానికి దారి" అంది. ★

(ఒక కన్నడ కథ ఆధారం)


విశేషణములన్నీ అయిపోయినవి

మరియు వాటిని వెతుకుటలో మా ఓటమిని ఒప్పుకొనవలసిందే యిందువలనంటే, 'సబ్బుయొక్క ఉత్కృష్టతను వర్ణించే పదములన్నింటిని మొదటే ఉపయోగించేశాం. ఇప్పుడు అధిక ప్రశంసకి యేమీ మిగులలేదు, కాని ఒకటి మాత్రం చెప్పవచ్చు. అదేమిటంటే హమామ్ స్నాన సబ్బు ఉత్కృష్టమైన నురుగు చేయును, అది మీ చర్మమును స్వచ్ఛముగా చేయును. అంతేగాక స్నానానంతరము అత్యధిక ఉత్సాహమును గలుగజేయును






సువాసన వుందా? వుందండి, మరగ? లేకేమి, కావలసినంత వుంది. మరి ధర? ప్రతి మనిషికి అందుబాటులో వుండునటువంటిది.

అత్యధిక ఉల్లాసమును పొందండి

టాటా యొక్క

హమామ్

టాయిలెట్ సబ్బు

టాటా ఆయిల్ మిల్స్

భారతదేశములో, భారతీయ పెట్టుబడితో, భారతీయ నిర్వహణ క్రింద తయారైనది.

# చెంచమ్మ

"ఏందమ్మోయ్! తలుపు తియ్యమ్మోయ్, తాళాలు వేసిస్రను, తాళాలు తియ్యమ్మోయ్" అని గట్టిగా ఓ అరుపు అరిచింది 'చెంచి' మా పనిమనిషి.

"గేటు తియ్యండర్రా, అప్పటికైనా ఆ అరుపులు తగ్గిస్తుంది" అంది మా అమ్మ.

తాళాలు పుచ్చుకు బయల్దేరాడు మా తమ్ముడు పెద్ద పెద్ద అంగలేస్తూ. గబగబా చీపురు పుచ్చుకొని అరుగుమీదకు వచ్చింది చెంచి. పడుకున్నవాళ్లు పడుకొని ఉండగా, లేచినవాళ్ళ మంచాలు అలాగే ఉండగా చిమ్మేసింది ఆ చివరనించి ఈ చివరకు

"అంట్లెయ్యమ్మాయ్, ఆ! అంట్లు తోమెత్తా" అని ఓ కేక వేసింది మా అమ్మకు వినిపించేటట్లు

"అంట్లూ వేసారు, గంట్లూ వేశారు, నీళ్ళతోడు ముందట నీళ్లు తోడమంటే ఓ పరుగుచ్చుకుంటావు వీథిలోకి" అంది మా అమ్మ దాని అరుపుకు రెండురెట్లు పెంచి

నిజమే దాన్ని నీళ్ళు తోడమంటే ఎన్నో సాకులు చెప్పి తప్పించుకుందామనుకుంటుంది

"నీళ్ళు లోతుకుపోయాయమ్మా"

"ఆ యానాదాళ్లు మూళ్ళూ, నాలుగులూ పుచ్చుకొంటూంటే నాకేవమ్మా ఆ! ఇంకోటిత్తేగాని ఒప్పుగోను. ఆ! లేకపోతే నరిపుచ్చుకొంటా నమ్మోయ్" అంటుంది వేళ్ళు చూపిస్తూ.

ఇన్ని సాకులు చెప్పినా డబ్బు పుచ్చుకుంటోంది కాబట్టి చివర నీళ్లలోకి గబగబా పరుగెట్టుతుంది

"దానికి మూడు రూపాయిలిస్తున్న అది అలాగే అంటుంది, పనిచెయ్యమంటే మాత్రము పరుగెట్టుతుంది" అంటూంది మా అమ్మ విసుగ్గా.

ఎమ్. వి. సుబ్బారావు

దాన్నిదివరకు మా అమ్మ మాన్పించినందుకే దానికి కాస్త కచ్చి చెప్పినపని చెయ్యదు దానికి తోచినదేదో చేస్తుంది అందుకని ఇదివరకు మా అమ్మ దాన్ని ఎలాగో తప్పించి క్రొత్తగా ప్రక్కన చేరిన 'విశాలాక్షమ్మ' గారి పనిమనిషి 'రవణ' ను పెట్టుకుంది మళ్ళీ ఆ రవణ 'తల్లికి జబ్బు" అను పేరుతో కోతలకు పారిపోయింది మళ్ళీ ఆ చెంచి కాళ్లే పట్టుకొని దాన్నే పనిమనిషిగా పెట్టుకుంది మా అమ్మ

కాని దానిలో మంచి గుణమేమిటంటే, అందులో మా నాన్నగారు బాగా దాన్ని మెచ్చుకొనేదెందుకంటే "ఎప్పుడూ మానెయ్యదని, వానవచ్చినా, వరద వచ్చినా మానెయ్యదని"

చిన్నవాళ్ళదగ్గరనుంచి పెద్దవాళ్ళవరకు ఇలాంటిదాని మంచి గుణాలు, రోజూ దాన్నిగురించి జరిగే విషయాలు, విశేషాలు అన్నీ రాత్రి ఎనిమిదిగంటలకు మానాన్నగారు ఎన్నో వళ్లతరబడిగా అలవాటుపడిన "షికారు" నుంచి వచ్చిన తర్వాత చెప్తారు, సాగదీస్తూ, సమాసాలు పెద్దవిచేస్తూ.

"నాన్నగారండీ! గుడ్డిదానికి అన్నం పెట్టనేమా చెంచి నీళ్ళు తోడి ఇచ్చిందట"..... అని తెలిసీ తెలియని వాక్యాలతో వచ్చీరాని మాటలతో మా బుల్లి చెల్లెలు


EZY-36 TEL



Zam-Buk

జామ్-బక్

చీడను తలపుష్ఠిపై వ్యాధులను, గజ్జిని త్వరలో నివారించును

అమూల్య సుగుణములన్నిటిలో గూడిన జామ్ బక్ ప్రపంచంలోకెల్లా అత్యుత్తమ చర్మరోగ నివారిణి జామ్-బక్ రోగహారిత తంత్రులను కుదపర్చును, వాపును శమన పర్చును మరియు త్వరలో చర్మమును మంచి ఆరోగ్యస్థితికి తెచ్చును



జామ్ బక్ ఇతర చర్మ వ్యాధులన్నిటికిన్ని గాయములకు కూడ అద్భుత నివారిణి.

అన్ని మందుల షాపులందునూ దొరకును

సోల్ ఏజంట్లు దాదా & కంపెని, 88, సెంబప్పనాయక్ వీథి మద్రాసు 1

ఒకే కంచంలో. ...

ఫొటో: ఎస్. కె, విఠల్—మద్రాసు.

#  చెంచమ్మ 

"వసు" చెపుతూంటే మా నాన్న గారు విసుగులేకుండా వింటూంటే మా అమ్మ వచ్చి అసలు విషయం ఏకరువు పెట్టుంది

"గుడ్డిది దానికి అన్నం పెట్టే అది దానికి మంచినీళ్లు తోడిచ్చి ఏదో ఇలాంటి సహాయాలు చేస్తూంటుంది" అని మాఅమ్మ చెప్పేసి లోపలికి వెళ్తుంది తన పని చూసుకోడానికి.

ఇంక మా పెద్ద చెల్లెళ్లు మొదలెడుతారు ఆ రోజు దాన్ని గురించి జరిగిన విషయాలు, విశేషాలు.

"ఏమ్మా! అలా రుసుచుంటాను ఏదేనా పని చెయ్యకూడదూ" అని అంటుంది మమ్మల్ని అని ఒక చెల్లెలు,

"ఏమ్మోయ్! మీ చిన్నబ్బాయి చెప్పినపని చేస్తాడమ్మా, మీ పెద్దబ్బాయి చెయ్యడమ్మోయ్ అందండి అమ్మతోటి" అంటుంది మా రెండవ చెల్లెలు

ఇవన్నీ విని మా నాన్నగారు "చూశారా దానికి ఉన్న మంచి గుణాలు మనకు లేవు" అంటూంటే మా అమ్మ "ఔను నిజమే లెండి" అని దాన్ని మెచ్చుకొని 'కాని' అనే మాటతో దాని పిచ్చి పని ఒకటి నెమరువేస్తుంది.

"కారాలు కొట్టవే చీర కొనిస్తాను అంటే సగం ఇది కొట్టి సగం అది కొట్టి మధ్యలో వదిలి పెట్టేసి "చీర కొనియ్యమ్మా" అంటుంది ఇంక దానికి పిచ్చివుందని వేరే చెప్పాలా."

ఇలా ఉంటుంది దానివని.

అంట్లు తోమేసి చెంబులు తోమేసి మధ్యలో చింతపండుకోసం "రవణ" (మా చెల్లెలు)తో కాస్త దెబ్బలాడి, నీళ్లు తోడేసి చీడీల మీద పడేసి "ముంతెత్తు కాత్తానమ్మోయ్" అని తన గుడిసెకి పోయి ముంత తెచ్చుకొని మా అమ్మచేత అన్నం పెట్టించుకొని "తలుపెయ్యమ్మోయ్ తలుపెయ్, రోజులేం బాగా లేవు ఆ!" అని నీతులు బోధిస్తూ పరుగెట్టుతుంది తన పూరిగుడిసెలోకి. ★



# ఇద్దరన్నదమ్ములు

పూర్వకాలమున చాలమంది జనులు బంగారమును సంపాదించుటకొఱకు దక్షిణ అమెరికాకు పోవుచుండిరి. స్పెయిన్ నివాసియైన పైజారో అను నాతడు బంగారమును సంపాదించి ధనవంతుడు కావలెనని తానుకూడ దక్షిణ అమెరికాకు బయలుదేరెను. ప్రయాణములో సహాయముకొఱకు తన అన్నయైన అలాంజోను రమ్మని యడిగెను. తాను సంపాదించిన బంగారములో సగమిచ్చెదనని చెప్పెను.

ఈ ప్రయాణమునుండి పైజారోను మరలించుటకై దానిలోని కష్టనష్టములను గురించి చెప్పినను నిష్ప్రయోజనములయ్యెను. అలాంజో తన తమ్మునికి ఒక నీతిని నేర్పుటకై ప్రయాణమునకు కావలసిన సామానులతోను, నౌకరులతోను, రకరకములైన కూరగాయల విత్తనములతోను బయలుదేరెను. పైజారో తన కున్న ఆస్తిని అమ్మివైచి ఒక పెద్దఓడను కొని కావలసిన వస్తువులను సేకరించుకొని ప్రయాణమునకు సిద్ధపడెను.

వారు తమ ప్రయాణమును సుఖముగా సాగించి అమెరికా దేశమును చేరిరి. అప్పుడు అలాంజో తన తమ్మునితో తాను సముద్రపు ఒడ్డుననే తన సేవకులతో ఉందుననియు, ఎప్పుడు పైజారో బంగారమును సంపాదించి తిరిగివచ్చునో అప్పుడే తానుకూడ స్పెయిన్‌కు పైజారుతో బయలుదేరెదనని చెప్పెను.

పైజారో తన అనుచరులతో బంగారముకొఱకు దేశమంతయు తిరిగి బంగారము ఎక్కువగా దొఱకు ప్రదేశమును చేరి తమకు కావలసిన బంగారమును సేకరించుకొనెను. కాని ఈ ప్రయాణములో పైజారో అనుచరులలో చాలమంది ఆకలికి తాళలేక చనిపోయిరి. చివరికి మిగిలిన పైజారో తన అనుచరులతోను, తాను సంపాదించిన బంగారముతోను అలాంజో ఉన్న చోటికి చేరెను.

పైజారో తన అనుచరులతో బంగారమును సంపాదించుటకు వెళ్లగానే అలాంజో తన అనుచరులతో సముద్రమునకు ప్రక్కనున్న భూమిని సారవంతముగా చేసి దానిలో తాను తెచ్చిన కూరగాయల విత్తనములను నాటెను. దీని వలన అలాంజో తమకు కావలసిన ఆహారమును సంపాదించుకొనుచుండెను. తీరికసమయములందు చేపలను పట్టుచు కాలము గడుపుచుండెను. పైజారో వచ్చునప్పటికి అలాంజో తినుటకు కావలసిన ఆహారమును సంపాదించుకొనెను.

అలాంజో, పైజారోను హృదయపూర్వకముగా నాహ్వానించి కుశలప్రశ్నలు వేసెను. అప్పుడు పైజారో, తాను చాల బంగారమును సంపాదించితి ననియు, కాని తాను తన యనుచరులు ఆకలితో బాధ పడుచుంటిమనియు, అందువలన తమ కాహారమునిమ్మని యడిగెను. అలాంజో వెంటనే పైజారోతో తాను ప్రయాణమునకు బయలుదేరు ముందు పైజారోతో చెప్పిన విధముగ పైజారో సంపాదించిన బంగారములో భాగమునకు రాననియు ఒకరి విషయమున ఇంకొకరు జోక్యము కలుగజేసికొనమనియు ఆ విషయమును గుర్తుకు తెచ్చుకొనమని చెప్పి, తాను ఈ యాహారమును చాల శ్రమపడి సంపాదించితినని చెప్పెను. కాని పైజారో కొంచెము బంగారమిచ్చిన యెడల కొంచె మాహార మిత్తునని చెప్పెను. పైజారో తన యన్న నిర్దయ గ్రహించి విధిలేక బంగారమిచ్చి యాహారమును తీసుకొనెను. పైజారో సంపాదించిన బంగారమంతయు ఆహారమును కొనుటకే సరిపోయెను.

అలాంజో తన తమ్మునితో తాము వచ్చిన ఓడలో స్పెయిన్‌కు పోదమని చెప్పగా పైజారో, అలాం

(56-వ పేజీ చూడండి)

★ గూడూరి నాగరాజరావు ★




## జరిగిన కథ:—

అది 1866 వ సంవత్సరం ప్రారంభం. సాగర గర్భంలో బ్రహ్మాండమైన జలజంతువేదో కనిపించిందనే వార్త ప్రపంచప్రజలను విభ్రాంతులను చేసింది. సముద్రంలో ప్రయాణంచేసే నౌకలకది ఇట్టే కనిపించి ఇట్టే మాయమయ్యేది. దానివలన నాగరిక ప్రపంచానికీ, ముఖ్యంగా నౌకాప్రయాణాలకి ప్రమాదం సంభవించవచ్చునని అందరూ అభిప్రాయపడ్డారు. దానికి అంతు కనుక్కొని హతమార్చాలని ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి. అమెరికా ప్రభుత్వం అబ్రహాం లింకన్ అనే యుద్ధనౌకను ఆ జలజంతువును వేటాడడానికి నియమించారు. అమెరికా ప్రభుత్వ నౌకాశాఖా కార్యదర్శి హాబ్సన్ ఫ్రెంచి ప్రకృతిశాస్త్రపరిశోధకుడు ప్రొఫెసర్ అరోనాను ఈ విజ్ఞానయాత్రలో పాల్గొనవలసిందని ప్రార్థిస్తాడు. అతడు వెంటనే దాని కంగీకరించి తన పరిచారకుడు కాన్సిల్ తో సహా ఓడ ఎక్కుతాడు. అబ్రహామ్‌లింకన్ క్రమక్రమంగా పసిఫిక్ మహాసముద్రంలో ప్రవేశిస్తుంది. అది అలాగ కొంతదూరం ప్రయాణం చేసేసరికి కొంతదూరంలో సముద్రతరంగాలమీద ఒక పెద్ద వెలుగు కనిపించింది. ఆ వెలుగు ఒక పెద్ద జలచరానికి సంబంధించినదై ఉండాలని నౌకాధికారులంతా ఊహించారు. నావ దానిదగ్గిరికి పట్టించి దానిమీద ఫిరంగిగుళ్ళవర్షం కురిపించారు. అబ్రహామ్‌లింకన్ తరవాత జరిగిన పోరాటంలో ఎందుకు పనికిరానిదై పోతుంది. ప్రొఫెసర్ అరోనా మరికొందరితో సహా సముద్రంలో పడిపోతారు. సముద్రంలో పడికొట్టుకుపోతూ కొంతసేపటికి ప్రొఫెసర్ అరోనా, కాన్సిల్ నెడ్‌లాండులతో కలిసి ఒక జలాంతర్గామిలో ప్రవేశిస్తారు. కొంతసేపటికి ఓడనావికులు వారికి సుష్టుగా భోజనం పెడతారు. భోజం చేసి అందరూ హాయిగా నిద్రపోతారు. తిరిగి తమ కన్నపానాలు రాలేదని అంతా ముఖం పడుతూంటే వారికి హఠాత్తుగా జలాంతర్గామి అధికారి హెచ్చరిక వినిపిస్తుంది. కెప్టెన్ నీమో ఇక ఆ ఓడలో నించి ఎవరూ బయటపడలేరని చెప్పి ప్రొఫెసరు అరోనాకు జలాంతర్గామి యంత్రాల రహస్యాలు తెలియజేస్తాడు.

అనువాదం: "వినాయక"

## 11 నాటిలస్ జలాంతర్గామి

కెప్టెన్ నీమో నేను కలిసి ఆ పక్కగది తలుపు తెరుచుకొని ఇంకొక గదిలో ప్రవేశించాము. అది కెప్టెన్ నీమో లైబ్రరీ. దానిలో ఒక రకమైన నిరుగుడు చేవ బీరువాలు, వాటిలో చక్కగా బైండు చేసిన పుస్తకాల సంపుటాలు చాలా ఉన్నాయి. ఇంకా సుఖంగా కూర్చోడానికీ, చదువుకోడానికీ వీలైన కుర్చీలు, బల్లలు కోకొల్లలుగా కనిపించాయి. వాటి కన్నిటికీ మధ్యగా ఒక పెద్దబల్ల. దానిమీద కొన్ని పేపర్లు, చాలావరకు పాతవే. తనాబీలో అమర్చిన నాలుగు విద్యుద్దీపాలు ఆ గది అంతా వెలుగు వెల్లువలతో ముంచెత్తివేస్తున్నాయి. అంత సొగసుగా, నీటుగా అమర్చిన గది చూసేసరికి నేనిక నా కళ్ళే నమ్మలేని స్థితిలో పడిపోయాను.



నేనా చుట్ట తీసుకొన్నాను దాని రంగు బంగారంలాగా తళతళ మెరిసింది! నే నది ముట్టించి నాలుగైదు పీల్పులు పీల్చాను

వాల్ట్‌డిస్నీ నిర్మించిన "సాగరగర్భంలో సాహసయాత్ర" ఇంగ్లీషుచిత్రంలో ప్రొఫెసర్ అరోనా, కెప్టెన్ నీమో

---

కెప్టెన్ నీమో ఆ గదిలో ప్రవేశిస్తూనే హాయిగా ఒక బాలీసు మీద జేర్లబడ్డాడు నే నతనితో అన్నాను

"కెప్టెన్! మీ లైబ్రరీ చూస్తే నా కెంతో ఆశ్చర్యంగా ఉంది సాగరగర్భంలో కూడా ఇది మీ వెంట వచ్చేసింది ఎంత అదృష్టవంతులు!"

"ప్రొఫెసర్! ఇక్కడ ఉన్నంత ప్రశాంతత ఇంకెక్కడైనా దొరుకుతుందా? మీరు మ్యూజియంలో చదువుకునే గదిలోకూడా ఇంత ప్రశాంతంగా ఉంటుందని తోచదు! అంతేనా?"

"నిజమే! మీరు చదువుకొనే గదితో పోలిస్తే నాగది దివిటీ ముందు దివ్వె! మీ దగ్గిర పడెనిమిది వేల పుస్తకాలదాకా ఉన్నట్లున్నాయే!"

"ఎక్కడ పడెనిమిది వేలు! 12 వేల సంపుటాలున్నాయి భూమికీ, నాకు మధ్యనున్న సంబంధం అంతా ఇంతే! నా జలాంతర్గామి సముద్రగర్భంలో ప్రవేశించేముందే నేనీ పుస్తకాలు, పత్రికలు, కరపత్రాలు మొదలైనవన్నీ జాగ్రత్త చేశాను అప్పటినుంచీ ప్రపంచంలో మరి వేరే కొత్త పుస్తకాలేవీ అచ్చుపడకపోతే బాగుండునని అనిపిస్తుంది మీకు వీటిలో ఏది కావలసినా నిరభ్యంతరంగా తీసుకు చదువుకో వచ్చును"

నేను దాని కెంతో సంతోషించి బీరువాలలో పుస్తకాల పరిశీలనలో పడ్డాను ఆ గ్రంథాలయంలో ఉన్న పుస్తకాలన్నీ చాలా వరకు శాస్త్రీయ విజ్ఞానానికీ, సాహిత్యానికీ, న్యాయశాస్త్రానికీ సంబంధించినవే! అవన్నీ అనేక భాషల్లో రాసిన పుస్తకాలు. అయితే వాటిలో అర్థశాస్త్రానికి సంబంధించిన పుస్తకం, ఒక్కటీ కనబడలేదు జలాంతర్గామిలో ఆ పుస్తకా లుండకూడదనే నిఘా ఏమన్నా ఉన్నదేమో! తెలియదు! అయితే ఆ పుస్తకాల కెక్కడా ఒక దారీ తెన్నూ ఉన్నట్టు కనబడలేదు! అన్నీ గజిబిజిగా అమర్చినట్టున్నాయి దానిని బట్టిచూస్తే కెప్టెన్ ఆ పుస్తకాలన్నీ హృత్కలిగా

చదువుతూండాలని అనిపించింది.

"చదువుకోడానికే గాక సిగరెట్లు కాల్చుకోడానికికూడా ఈ గదే వాడుతూంటాను." అన్నాడు కెప్టెన్.

"అయితే మీ రిక్కడ చుట్టలు, సిగరెట్లు కాలుస్తూంటా రన్న మాట!"

"నిరభ్యంతరంగా!"

"అయితే మీకు, హవానాకు బాగాదగ్గిర సంబంధం ఉండి తీరాలే!"

"అబ్బే! నాకు, హవానాకు ఎలాంటి సంబంధము లేదు. అయితే మీరీ పొగచుట్ట కాల్చిచూడండి! దీనికీ, హవానా చుట్టకీ ఏమీ తేడా కనబడదు"

నేనా చుట్ట తీసుకొన్నాను దాని రంగు బంగారంలా తళాతళా మెరిసింది! నే నదిముట్టించి నాలుగైదు పీల్పులు పీల్చాను:

"చాలా బాగుందే! కాని హవానా పొగాకు మాత్రం కాదు."

"మీ రన్నది నిజమే! ఇది ఒక రకమైన సముద్రపు తీగల ఆకులు చుట్టి తయారు చేసిన చుట్ట అచ్చంగా పొగాకులాగే కాలుతుంది. అయితే ఇది అంత ఎక్కువగా సప్లయి కావడంలేదు మీరు సామాన్యంగా కాల్చే హవానా చుట్టలకు బదులుగా ఇది కాల్చుకోవచ్చును మీ కెన్ని కావలిసినా సప్లయి చెయ్యగలను"

అటుపిమ్మట కెప్టెన్ ఇంకో గది తలుపు తెరిచాడు దానిలోని దీపాలన్నీ తళతళా మెరిసిపోతున్నాయి. అది చాలా విశాలమైన గది దానినిండా కెప్టెన్ సంపాదించిన చిత్రచిత్రమైన వస్తువు లెన్నెన్నో ఉన్నాయి. ఇంకా అక్కడ గొప్పగొప్ప చిత్రకారుల చిత్తరువులు కూడా అమర్చారు. అయితే కొన్ని కొన్ని వస్తువులు చిందరవందరగా అమర్చినట్లున్నాయి చిత్తరువు లించుమించుగా 30 దాకా ఉన్నాయి అవ్వన్నీ చాలా చక్కగా వేలాడగట్టారు

ఆ చిత్రాలు నేనింతకు పూర్వం పెద్దపెద్ద ప్రదర్శనాలలో చూచినవే కెప్టెన్ నాకా ఓడలో ఎన్నో చిత్రచిత్రమైన అత్యద్భుత విషయాలు చూపిస్తానని చెప్పాడు. అప్పుడే అతని జోస్యం ఫలించడం ప్రారంభించినదన్న మాట!

"ప్రొఫెసర్! మిమ్మల్నిక్కడికి తీసుకువచ్చేసరికి ఇక్కడి వస్తువులన్నీ ఇంకా బాగా సర్ది ఉంచవలసింది. కాని పని తొందరలో ఆ విషయం మరిచిపోయాను. నన్ను మన్నించవలసిందని కోరుతున్నాను!" అన్నాడు కెప్టెన్.

"మీ సంగతి సందర్భాలు తెలుసుకోవాలని అనడం లేదు గాని మీరెవరో గొప్ప శిల్పులై ఉండాలని అనుకుంటున్నాను." అన్నాను.

ఇందులో నాకంత ప్రత్యేకత ఏమీ లేదు. పూర్వం నేనిలాంటి చిత్తరువులంటే చెవికోసుకునేవాణ్ణి. ఇవ్వన్నీ ఆకాలంలో జాగ్రత్తపెట్టినవే. ఇవి చాలా విలవైనవస్తువులు."

ఆపక్కనే నాకొక పియానో, కొన్ని అమూల్యమైన సంగీత గ్రంథాలు ప్రత్యక్షమైనాయి.

"ఇంకా చాలా అమూల్యమైన సంగీత గ్రంథాలుకూడా నేక




ఎస్ట్రెలా బ్యాటరీలు లిమిటెడ్.,
బొంబాయి–మద్రాస్–ఢిల్లీ–నాగపూర్–కలకత్తా–కాన్పూరి
NAS-56 E-9

"దాని తెలుపు
అది శుద్ధమైనదని
నాకు తెలుపుచున్నది"
అని ఎమ్. ఎన్. రాజమ్
చెప్పుచున్నది
అందుచేతనే నేను ఎల్లప్పుడూ
లక్స్ టాయ్‌లెట్
సబ్బును వాడుచున్నాను."




ఎమ్. ఎన్. రాజమ్ ఇలా చెప్పుచున్నది:













సినీమా తారలకు సౌందర్యమునిచ్చు శుద్ధమైన తెల్లని సబ్బు

LTS 480 X52 TL

భారతదేశంలో తయారుచేయబడినది

రించాలే!" అన్నాను.

"అవునవును! వాళ్ళంతా కాలావధులు దాటిపోయిన మహా సంగీత విద్వాంసులు ఇక్కడఉన్న తరవాత వాళ్ళంతా మరణించినట్లే లెఖ్ఖ! ఇంచుమించుగా నేనూ అంతే!"

అని చెప్పి కెప్టెన్ నీమో మళ్ళీ ఏదో పెద్ద ఆలోచనలో పడ్డాడు. నేనతని ముఖభంగిమ గమనిస్తూ అలాగే నిలుచుండిపోయాను ఆపైన అతని మౌనముద్రకు భంగం కలిగించడాని కిష్టంలేక ఆ సమీపంలో ఉన్న చిత్రవిచిత్రమైనవస్తువు లొక్కొకటిగా పరిశీలించడం మొదలుపెట్టాను అక్కడ కనిపించినవన్నీ చాలా వరకు సాగరగర్భంలో దొరికే శంఖాలు చిన్న చిన్న ముక్కలు మొదలైన వస్తువులు. అవన్నీ కెప్టెన్ నీమో స్వయంగా సేకరించాడట ఇంకా ఆగదికి మధ్య భాగంలో ఒక చక్కని జలయంత్ర ధారకూడా అమర్చారు. రంగు రంగుల విద్యుద్దీపాల కాంతులలో ఆధార ఒక చక్కని జలదేవతలా నాట్యం చేసింది ఆధారకు చుట్టూ రంగురంగుల గాజు పూల సెజ్జలున్నాయి వాటిలో సముద్రంలో లభించిన అపురూపమైన అత్యద్భుత ప్రాకృతిక వస్తువులెన్నెన్నో భద్రపరిచారు అవ్వన్నీ నా కనులకు మిరుమిట్లుగొల్పుతూ ఎంతో సొగసుగా మెరిసి పోయాయి ఒక గాజు పూలసజ్జలో ఒక విచిత్రమైన చేప మిలమిలలాడుతూ మెరిసింది అది హిందూ మహాసముద్ర గర్భంలో చాలా అరుదుగా దొరికే చేప దాని శరీరం మీద మచ్చలు చుక్కలగుంపులా తళతళా మెరిశాయి యిరోపా జంతు ప్రదర్శన శాలలలో ఎక్కడో గాని అదికంటబడదు ఆ చేప కావాలంటే అధమం 8 వందల పౌనులైనా ఖర్చు పెట్టాలి దాని పక్కగా అలాంటిదే ఇంకొక చేప కనిపించింది అది ఆస్ట్రేలియా సముద్రంఅంతా గాలించగా ఎక్కడో ఒక్కచోట దొరికిందట ఇంకా అక్కడ మెక్సికో జలసంధి, న్యూజీలాండు సముద్రము గాలించి పట్టుకున్న చిత్రవిచిత్రమైన చేపల జాతులెన్నో ఉన్నాయి

ఇంకా ఆ గవిగోడలపై రంగు రంగుల ముత్యాలహారాలెన్నో వేళ్లాడగట్టారు. అవ్వన్నీ సాగరగర్భంలో ముత్యాల చిప్పలలో నించి సేకరించిన ముత్యాలతో తయారైన హారాలే

వాటిలో కొన్ని విద్యుద్దీప కాంతులలో దీపాల మాలికల్లా మెరిసిపోయాయి మరి కొన్ని ఆకుపచ్చని ముత్యాలహారాలు ఇంకా కొన్ని పగడాలదండలేమో అనిపించాయి కొన్నికొన్ని కోడిగుడ్డు కన్నా పెద్ద ముత్యాలు! వాటిలో ఒక్కొక్క దాని ఖరీదు 2 లక్షల ఫ్రాంకాలదాకా ఉండవచ్చును. మొత్తంమీద ఆ ముత్యాలహారాల ఖరీదు అంచనా కట్టడం చాలా కష్టం! కెప్టెన్ నీమో అరంగురంగుల ముత్యాలహారాలన్నీ సేకరించడానికి లక్షలాదిగా ధనం ఖర్చు చేసి ఉంటాడని అనిపించింది.

అయితే అవ్వన్నీ చూస్తూంటే నాకొక అనుమానం బయలు దేరింది. అవ్వన్నీ కొనడానికి ఆయనకు ఆ డబ్బంతా ఎక్కడనించి వచ్చింది? అని నాలో నేననేకవిధాలుగా మథనపడ్డాను అంతలో హఠాత్తుగా కెప్టెన్ నిమో నాతో ఇలాగన్నాడు:

ప్రొఫెసర్! మీరీ హారాలన్నీ చాలా జాగ్రత్తగా పరిశీలిస్తున్నట్లున్నారు! మీలాంటి ప్రకృతి శాస్త్రజ్ఞుల కివి చాలా విచిత్రంగా కనిపించడంలో పెద్ద ఆశ్చర్యమేమీ లేదు నాకీ హారాలంటే చాలా ఇష్టం! అయితే దీనికి కారణముంది! ఇవి ప్రపంచంలోని సాగరగర్భాలన్నిటిలోనించీ ప్రత్యేకంగా సేకరించిన హారాలు అదీగాక అవన్నీ నేనై స్వయంగా సంపాదించిన ముత్యాలు. కనక నే అవంటే నాకంతటి అభిమానం ఏర్పడింది"

దానికి నేనిలాగన్నాను

"మీకీ హారాలంటే ఇంతటి అభిమానం ఏర్పడడం సహజమే! యిరోపాలో ఇంతటి అమూల్య విచిత్రవస్తువులున్న వస్తుప్రదర్శనశాలకి ఏదీ కనిపించదు అయితే ఇంతమాత్రానికే ఇంతగా ఉబ్బితబ్బిబ్బయిపోతే ఎలాగ? ఈవిచిత్ర వస్తువులన్నీ ఉంచిన ఈ జలాంతర్గామి నిర్మాణంలో ఇంకా ఎలాటి

ఫలితమైన నంజనగూడు పండ్లపొడి వారి
అగత్యమైన కుటుంబ ఔషధములు
కాస్మస్ — కస్తూరి మాత్రలు
కర్జిక — గోరోజన మాత్రలు
బాలక్స — విరేచనమగుటకు మాత్రలు
మా మందుల పూర్తి వివరాలకు వ్రాయుడు
యునైటెడ్ కన్సర్న్, బందరు వీధి, మద్రాసు-1, విజయవాడ

RATNAM'S 'N' OIL
సేవించిన పూర్తి సంతోష సౌఖ్యము లనుభవించగలరు.
1 సీసా రూ 1 1 4 0
ఎడ్వాన్సుతో జాబు వ్రాయండి
డాక్టర్. రత్నం సన్స్,
మలకపేట బిల్డింగ్స్, హైదరాబాదు - 2

అద్భుతాలున్నాయో! అయితే ఈ జలాంతర్గామి రహస్యాలేమీ నాక్కరలేదు కాని దీనిలోని చిత్రవిచిత్రమైన యంత్రాలు చూస్తే మాత్రం నాకెంతో ఆశ్చర్యంగా ఉంది!"

"ప్రొఫెసర్! నేను మీకే జలాంతర్గామిలో సంపూర్ణమైన స్వాతంత్ర్యం ఉండగలదని వాగ్దానం ఇచ్చి ఉన్నాను అంటే మీకీ యంత్రాలన్నీ పరిశీలించే అవకాశం ఇచ్చానన్న మాట! క్రమక్రమంగా మీకీ యంత్రాల ఉపయోగం అంతా తెలియజెయ్యాలనే అనుకుంటున్నాను. ముందుగా మీరుండే గది వివరాలన్నీ తెలియజేస్తాను నా వెంట రండి!"

వెంటనే నేను కెప్టెన్ వెనకాలే నడిచి వెళ్లాను నీమో నేను దారిలో ఎన్నెన్నో ద్వారాలు దాటి జలాంతర్గామి మధ్యకు చేరుకున్నాము. అక్కడ చక్కగా అమర్చిన ఒక గదిలోకి వెళ్లాము అది నాకోసం ప్రత్యేకించారు అక్కడ నావంటి వాడు సుఖంగా చదువుకుంటూ కాలక్షేపం చెయ్యడానికి కావలసిన హంగులన్నీ ఉన్నాయి కెప్టెన్ నీమో కెంతో వినయంగా నా కృతజ్ఞత తెలియచేశాను

కెప్టెన్ నీమో "నా గది మీ గదికి పక్కనే ఉంది కావలిస్తే ఇందులోనించి ఆ [illegible] వస్తువులున్న గదిలోకి కూడా వెళ్ళవచ్చును." అన్నాడు

తరవాత మేమిద్దరము కెప్టెన్ గదిలోకి వెళ్లాము అందులో అంతటి పెద్ద ఆర్భాటము, హంగామా ఏమీ కనిపించలేదు అన్నీ చాలా సంసారపక్షంగా ఉన్నాయి. గదిమధ్య అమర్చిన విద్యుద్దీపం మాత్రం కళ్ళు జిగేలుమనేటట్టు మెరిసిపోతూంది అక్కడ ఉన్నవన్నీ కేవలం అత్యావశ్యకమైన వస్తువులే

కెప్టెన్ నీమో నాకొక కుర్చీ చూపిస్తూ—

"దయచేసి అక్కడ కూర్చోండి." అన్నాడు

నేను నెమ్మదిగా ఆ కుర్చీలో కూర్చున్నాను.

(ఇంకా ఉంది)


## చూడండి మెక్లీన్సు దంతాల్ని ఎంత చక్కగా శుభ్రపరుస్తుంది!




మెక్లీన్సు మామూలుపద్ధతిని బ్రోసుటకి అందని అపాయకరమైన చోట్లను సూటిగా దొరకబట్టి శుభ్రపరచును

### దంతక్షయాన్ని అరికట్టుటకు అత్యంత ప్రధానమైనది అదే

ఈ – [illegible] ఆహారంలో కొన్ని కొవ్వు పదార్థములున్నవి దీనినే 'క్రైపాయిర్సు' అని దంత వైద్యులు నిరూపించి యున్నారు దీనిని ఎంతబాగా తోమినా పోవు ఆ పొరలోపలా వెనకా అమూల్య [illegible] భయంకరమైన పనిని సాగిస్తూనే వుంటాయి అవి మీ పళ్ల మెరుగును తినివేస్తూనే వుంటాయి ఆ దంతక్షయమును అరికట్టడానికి తొలిమెట్టు ఈ క్రైపాయిర్సును క్రమం తప్పకుండా తొలగిస్తూనే వుండడం

క్రైపాయిర్సు ని నిశ్శేషంగా తొలగించటానికి ఉన్న ఒక్కటే మార్గం దానిని కరిగించివేయడం నోటనిండా నురగను కలిగించక అతి సున్నితముగాను సురక్షితంగాను అతి శీఘ్రంగా క్రైపాయిర్సును, సూటిగా పోగొట్టే గుణమును మెక్లీన్సు కలిగియున్నది అదే దంత క్షయాన్ని అరికట్టుటకు అత్యంత ప్రధానమైనది

మెక్లీన్సును క్రమం తప్పక రోజుకు రెండుసార్లు ప్రతిరోజు వాడండి మరి, జ్ఞాపకం వుంచుకొనండి మెక్లీన్సు ఫలితంగా దంతాలే ఆరోగ్యవంతమైన దంతాలు.




క్లోరోఫిల్ కలదిన్నీ లభిస్తుంది

MTY-41 TEL

(12 వ పేజీ తరువాయి)

రెండు నెలలు దాటినా మిగతా పైకం వచ్చే సూచనలైనా కనబడక పోవటాన జ్ఞప్తికలను రెంటిని వ్రాశాడు రామకృష్ణయ్య అవి సక్రమంగానే చేరాయి గమ్యస్థలాన్ని కాని ఈ పత్రాల్లో ప్రత్యేకతేమీ కన్పించనే లేదక్కడ పరిశీలించవలసిన వ్యక్తికి ఆయన కలాటివి పరిపాటైన పత్రాలే గాటి! ఆ వ్యక్తిమాత్రమేం బాధ్యుడా, రామకృష్ణయ్యగారి లెక్క తేలపోవటానికి, ఆయన కింద రామకృష్ణయ్యల లెక్కలు లక్షొతొంభై రోజుకి అసలు వీళ్ళందరి లెక్కలతోట పాపం ఆయనప్రాణం విసుగెత్తిపోతుంది రోజూ వాటికితోడు వ్యక్తిగతంగా వారికున్న బాధలు వారివి ఇదిలా వుండగా న్యాయంగా పోయిచూచి లెక్కలు సరిపెట్టమని మొహమాట పెట్టేవాళ్ళ బాధొకటి స్వయంగా వచ్చికూర్చున్న పెద్దమనిషిని కాదనటం భావ్యం కాదనిపించటం వల్ల వాళ్ళ లెక్కలు తేల్చటంతోనే చాలా సమయం వెచ్చింపబడి పోతుంటుం దా వ్యక్తికి ఇక పోస్టులో ముక్కానీకార్డు వ్రాసేవాళ్ళ లెక్కలు తెముల్చటానికెక్కడ కుదురుతుంది? పాపం అప్పటికే ఆయన రామకృష్ణయ్యగారి లెక్క తేల్చాలనే తీసికోనేవాడా" అర్జంటు ఫైలు"ను ఏవో అనుమానాలూ అభ్యంతరాలూ కనిపించటం వాటిని గురించి ఆలోచించబోయే సరికి, 'అయ్యగారి కబురూ, "ముందు వారి ఎకౌంటు సెటిల్ చెయ్యమని" ఆ కేకం యెవనో వొక వ్యక్తిని చూపిస్తూ! ఈఅడ్డంకులతో రామకృష్ణయ్యగారి లెక్క తెగనిదై పోయింది ఆ వ్యక్తి మాత్రమేం చేస్తాడు?"

రామకృష్ణయ్యగారి సహనశక్తి రోజులు గడుస్తున్న కొద్దీ నశించుకు పోతోంది చమురైపోయిన దీప కాంతిలా, దీనికితోడు తనకు జబ్బు తిరగబెట్టే సూచనలు కన్పించసాగాయి దాంతో మళ్ళీ భయమావరించుకుంటున్న దాయనను మరో జ్ఞాపికను వ్రాశారా ఆఫీసరుగారి పేరిట అది జ్ఞాపిక అనే దానికన్నా విజ్ఞాపనం లే బాగుంటుందేమో అది వ్రాసిన శైలినిబట్టి అతి దీనంగా, తన అనారోగ్యాన్ని గురించీ, స్వంతయిల్లు కట్టుకోవాలనే సంకల్పాన్ని గురించీకూడా అందులో వ్రాసి, డబ్బందిందే తడవుగా పునాది వేసుకోవాలని ప్రతిరోజూ యెదురు చూస్తున్నాననికూడా వ్రాసుకున్నారు ఇది చూచిన వెంటనే ఆఫీసరా గుమాస్తాని పిలిచి వాటికు చీవాట్లు పెట్టి సాయంకాలానికి లెక్కతేల్చి తెమ్మన్నారు సాయంకాలానికి రామకృష్ణయ్యగారి కాగితాలన్నీ ఆఫీసరుగారికి అర్జంటు ఫైల్"లో సమర్పించబడ్డాయి కాని, పరో జనంమాత్రం శూన్యం అదేదో భోగట్టా క్రింది ఆఫీసులనుండి వస్తేనేగాని రామకృష్ణయ్యగారి లెక్క తేలదని వ్రాసి పెట్టాడు గుమాస్తా కావలసిన రూల్సన్నీ వుదహరించి దిక్కుతోచక మనలేక ఆఫీసరు సంతకం చేశాడు కాగితాలమీద 'అతి జరూరు' అని మాత్రం వ్రాసి

రామకృష్ణయ్య ఆరోగ్యస్థితి తిరిగి ఆందోళనకరంగా పరిణమించింది మళ్ళీ మంచాన పడ్డారు మళ్లీ భగవంతుణ్ణి ప్రార్థించాడు కలలలో కూడా యింటినే కట్టిస్తున్నాడు జాగ్రదవస్థలోనే కలవరింతలు ప్రారంభమైనాయి "ఆగోడ మందము వొక్క అడుగుంచేచాలు, కిటికీలు మరి కొంచెం ఎత్తులో వుండాలి అద్దె భాగానికి ముఖ్యంగా గాలీ వెలుగూ బాగా వచ్చేటట్టు చూడండి సిమెంటుదగ్గర లోభం వద్దు సరిగా పాళ్లు కలపండి మరో పదిరోజుల్లో కప్పు పూర్తవుతుంది వెంటనే గృహప్రవేశ ముహూర్తాలున్నాయి ఏదో యీనాళ్లూ శ్రమపడితే హాయిగా స్వంతయింట్లో విశ్రాంతి తీసికోవచ్చు లక్ష్మీ!" అంటూ ఏకధోరణిగా మాటాడుతున్నాడు డాక్టరు దక్షిణామూర్తి "మంచుగడ్డ" తలకుకట్టి మళ్లీవస్తానన్నారు లక్ష్మీదేవమ్మకు మతిపోయినట్టుగా తానేంచేస్తున్నదో తెలియనిస్థితిలో పడిపోయింది రామకృష్ణయ్యకు కొంచెం వుధృతం తగ్గిన వెంటనే "పాసు వచ్చిందా?" అని ప్రశ్నించాడు ఆమె మౌనమే ఆయనకు సమాధానమైంది తరువాత ఆయన యీలోకంలోనే లేనట్టు కన్పించాడు మర్నాడు ప్రొద్దున డాక్టరొచ్చి యింజక్షనిచ్చాడు లక్ష్మీదేవమ్మకు ధైర్యం చెప్పారంత డాక్టరిచ్చిన యింజక్షను వెంటనే జవాబిసం నీ యేవో దాని రికి తోచినట్లు వారు చెప్పారు 'పాస్' అని జవాను వొకపెద్ద కవరిచ్చిపోయాక అందుకున్న రామకృష్ణయ్య స్నేహితుడు, అంతకుముందాయనపనిచేసిన ఆఫీసు హెడ్ గుమాస్తా చించి ప్రావిడెంటుఫండు బిల్లు పదివేలొచ్చాయన్నాడు లక్ష్మీదేవమ్మ మనసు బరువు దించినట్లయింది ఈమాట రామకృష్ణయ్య వద్ద నవమాతుందగ, వెయ్యిదేముళ్లకు మొక్కుకుంటూ "ఏమండీ! బిల్లు వచ్చిందండీ! బిల్లు వచ్చిందండీ" అని తట్టింది అప్పుడే స్పృహ వచ్చిన రామకృష్ణయ్య కళ్ళంట నీరు కారుస్తూ "బిల్లు వచ్చిందా? పునాది కుపయోగిస్తుందనుకొన్నాను 'సమాధి' కుపయోగిస్తుందనుకోలేదు అంతా దేవుడి దయ లక్ష్మీ!" అన్నాడతి నీరసంగా ఆఖరిమాటగా! లక్ష్మీదేవమ్మ బావురుమంది అంతా అయ్యో అనుకున్నారు

* * *

సమాధికైనా వుపయోగిస్తుందనుకున్నాం అదీచేతికి రాలేదు పెన్షన్ సర్టిఫికేటు లేందే బిల్లు మారదన్నాడా హెడ్‌గుమాస్తా కన్నీళ్లు తుడుచుకుంటూ ఊళ్ళో పావలా కారు దయవల్ల యిన్ని నీళ్లు వదలటానికి వీలైంది రామకృష్ణయ్యకు లక్ష్మీదేవమ్మ గతేమాయని బాధపడ్డ రామకృష్ణయ్య ఆత్మశాంతికని రామకృష్ణయ్య త్రవ్వించుకున్న నుయ్యి ఆధారంగా చూపాడు భగవంతుడు

* * *

ఏమిట్లో పాపమా ఖరీకలా అయింది అన్నాడో సానుభూతిపరుడు లక్ష్మీదేవమ్మ శరీర మగ్ని దేవుని కాహుతౌతుండగా మరో! 'రెడ్ టేపు' యింత యిదిగా వుండకూడదని నిర్ధారించారు శ్మశాన వైరాగ్యంతో ఉద్యోగులంతా ★

(49-వ పేజీ తరువాయి)

జోను అచ్చటనే వదలివేసి తాను తన యనుచరులతో వెళ్లెదనని చెప్పెను కాని అలాంజో ఈ మాటలకు ఏమి యనుకొనకుండ ధనము వలన బ్రతుకలేమనియు, కాయకష్టమువలన జీవించుటకు వీలగుననియు తెలుపుటకే ఈ విధముగ చేసితినని చెప్పెను

పైజారో తనకు కలిగిన యనుభవమువలన బంగారమును సంపాదించుట కన్న శ్రమించుట గొప్పదని తెలిసికొనెను స్పెయిన్ కు ప్రయాణము చేయుచుండగ దారిలో తన అన్నను బంగారము తీసుకొనమని పైజారో బలవంతము చేయగా అలాంజో దాని కొప్పుకొనక, తాను సుఖముగా జీవించుటకు కావలసిన యాహారమును సంపాదించుకొనగలననియు, తనకు బంగారము అవసరములేదని చెప్పెను ★

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd, by S Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras 1 Editor S Sambhu Prasad




మహాకవి తిక్కన

(చిత్రకారుడు: డి. వి. నాయుడు—మద్రాసు.)

“....మహాకవిత్వదీ
క్షా విధినంది పద్యముల గద్యములన్ రచియించెదన్ కృతుల్.”

# ఈ అందమైన చీర అందముగ మన్నుతుంది!

బిన్నీవారి జార్జెట్ చీరలను యింటివద్ద ఉతుకుకోవచ్చును అయినా అవి ఒంటి మీద అందముగ నిలిచేలా ఉంటాయి. వాటి మనోహరమైన రంగులుపోవు

బిన్నీవారి జార్జెట్ చీర కట్టుకుని ఎంత అందముగ
కనబడుతున్నారు అది ఎంతో దట్టముగ నేయబడినది
మరియు చాల కాలము మన్నుతుంది
బిన్నీవారి జార్జెట్ చీరను యింటివద్ద
మీ యిష్టమువచ్చినన్నిసార్లు ఉతికినా
దాని రంగులు ఎన్నటికీ తగ్గిపోవు లేక
వెలిసిపోవు మరియు అది ఎల్లప్పుడూ
ఒంటిమీద అందముగా నిలుస్తుంది

అందముగ చాల కాలము మన్నుటకు
బిన్నీవారి జార్జెట్ చీరను ఎన్నుకొనండి!



అసలైన బిన్నీవారి చీర
లన్నిటిమీద బంగారు
రంగులో యీ ముద్ర
వేయబడినది

బెంగుళూరు వులెన్, కాటన్ అండ్ సిల్కు మిల్సు కంపెనీ లిమిటెడ్
ఏజెంట్సు సెక్రటరీస్ అండ్ ట్రెజరర్సు
బిన్నీ అండ్ కంపెనీ (మద్రాసు) లిమిటెడ్

BY. 3120